శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౩ } దుర్ముఖ సంవత్సరము మార్గశీర్ష - పుష్యమాసములు { సంచిక ౩

## కాశీఖండము - ముద్రణసంస్కారము

'గాండీవి'

భాషావాఙ్మయాభివృద్ధికి ముద్రణము లత్యంతోపకారకము లనుట నిర్వివాదాంశము ముద్రణసంస్కర్తల స్వసిద్ధాంతస్థాపనాపరత్వమును, భ్రమప్రమాదములును గారణములుగా భాష ఆర్షము అగుచున్నదనుట సర్వవిదితము.

పూర్వపూర్వముద్రణములకంటె నుత్తరోత్తరముద్రణములు సర్వాంగసుందరములుగాఁ బెంపొందుచుండుట సహజము. కాని యు దేమి పాపమో వావిళ్ల వారిచే 1924 లోఁ బ్రకటింపఁబడిన కాశీఖండప్రతులలో లేని యతిభ్రంశాలు 1953 లో వారిచేతనే ప్రచురింపఁబడిన నూతనముద్రణమునందుఁ గన్పట్టుచున్నవి. దీనికిఁ గారణము మృగ్యము.

తప్పులకుప్పలగు తాళపత్రమాతృకలనుండి కవిప్రయుక్తపాఠములను నిర్ణయింపవలసివచ్చినప్పుడు పరిష్కర్తలు కొంత స్వాతంత్ర్యమును వహింపక తప్పదు. కాని వారు చేయు సవరణలుమాత్రము కవిప్రయుక్తములని విశ్వసింపఁదగినవిగా నుండవలయును.

శనైశ్చరలోకవర్ణనావసరమున నూతనముద్రణమున నీక్రింది గీతపాదము కలదు. "దంపతులు చని రాత్మీయసదనమునకు" (4-275) పూర్వముద్రణమున "దంపతులు చని రాత్మసంస్థానమునకు" నని కలదు. రెండుముద్రణములందును యతిభంగ మనివార్యమే. యతిభ్రం

శము కాన నిట్లు పాఠ ముండియుండును. "చనిరి దంపతు లాత్మీయ సదనమునకు" (ఉ. వేం. రం.) అని యధోభాగమున సవరణము చూపఁబడినది. 'దంపతులు చని రాత్మీయసదనమునకు' ననుదానిని బట్టి కవి పాఠము నిర్ణయింపవలసివచ్చినపుడు 'జంపతులు చని రాత్మీయ సదనమునకు' నని సవరించుట యుక్తము కాని పద్యపాదము నంతటిని మార్చుఁజూచుట సరికాదు గదా !

జంపతులఁ జేయునందాఁకఁ జలముగొనిరె (6-172) నని కాశీఖండముననే వేఱొకచోట జకారము యతిస్థానగతమై యుండుట గమనించితిమేని జంపతు లనుపదమే కవిప్రయుక్తమని విజ్ఞుల మనోవీథిని విహరింపకమానదు.

కాశీఖండమున శివశర్మోపాఖ్యానమున నీక్రిందిపద్యము గలదు.

సీ. పాడిదగ్గు కంఠంబుఁ బొరిపుచ్చకయమున్న
తలప్రకంపంబుఁ బొందకయమున్న
గీ. పండ్లు వేర్వాసి కదలుచూపకయమున్న
కాలి కడకంటిచూపు పైరాకమున్న
కాలుసే యాడుకాలంబె కదలవలయుఁ
దీర్థసేవకు దేహ మస్థిరము గాన. (3-84)

ఇటఁ 'గాలి కడకంటిచూపు పైరాకమున్న' యనుచో యతి భంగము స్పష్టము. పూర్వముద్రణమునఁ గాకి కడకంటిచూపు పైరాక మున్న' యని కలదు. కాకి కడకంటిచూపన నేమిా యర్థముకాక కాలి యని నూతనముద్రణమున సవరించియుండును. యతిభంగము వాటిల్లుచున్నట్లు గుర్తించియుండరు.

ప్రకృతపద్యమున శరీరశైథిల్యమునకు సంబంధించిన విషయము లను వరుసగాఁ జేర్కొనుచుఁ 'గాకి కడకంటిచూపు పైరాకమున్న' అనుపది మరణావస్థకు ద్యోతకముగా సంప్రదాయాభిజ్ఞుఁడగు మహాకవి వాడియుండును. కాకి కడకంటిచూపు పైవచ్చుట పిండప్రదానకాల

మున జరుగును. కాన నావిషయమునుబట్టి యీవాక్యము మరణావస్థ ద్యోతకముగా గ్రహింపనగును.

గీ. మఱల నిదె యొక్కసారిగా మాన వేశ
సతుల గళసూత్రముల్ తెగి జారిపోవ
నేడ్వఁగావలెఁ గాకమ్ము లెగురవలెఁ బు
రములపైఁ బిండుగట్టి పిండములకొఱకు.

(బాలధన్వఖండము 414 ప.)

వను విశ్వనాథ సత్యనారాయణగారి పద్యమీసంప్రదాయమునే యనుసరించినది. వేములవాడ భీమకవిదిగా జనశ్రుతిలోనున్న యీ క్రిందిపద్యము కాకి కడకంటిచూపను ప్రయోగమునకు సాధకముగా నున్నది.

క. కాటికి కట్టెలు చేరెను
నేటవతల నక్కలెల్ల నేడువఁదొడఁగెఁ
గాటికిఁ గాకులు చేరెను
లేటవరపుఁ జోతరాజు లేఁడా ? లేఁడా ?

పూర్వముద్రణములో యతిభ్రంశములు లేని స్థలములందును నూతనముద్రణమున యతిభ్రంశములు కన్పట్టుట నిజముగా శోచనీయమైన విషయము.

వి, శ్వేతక్షేత్రవియన్నదీవటుకఢుంఠీనాథసత్కీర్తనోద్దేశప్రక్రమ
.................. (1-81)

'ఢుంఠీనాథ' యనుచో నూతనముద్రణమున యతి భంగము. పూర్వముద్రణమున 'ఢుంఠీశాదె' యని కలదు. యతి సరిపెట్టుటకై 'ఘుంఠీశాది' యను పాఠము గ్రహించియుండును. ఇది తాళపత్ర మాతృకాపాఠమో సంస్కర్తగారి సవరణమో తెలియదు. సవరణమే యగుచో 'ఢుంఠీశాన' యనియు సవరింపనగును.

'కేవలత్వశుభశ్రేణిఁ గ్రుంకు వెట్టె' (3-90)

'క్రేణివట్టె' యను పూర్వముద్రణపాఠమున విశ్రమభంగము వాటిల్లలేదు. ఇట యతిభంగము స్పష్టము.

'రాశి పోయుదు మఖిలపాత్రికలయందు' (7-178)

'పాత్రములయందు' యను పూర్వముద్రణపాఠమునే గ్రహించి నచో నీ యతిభంగము వారింపఁబడును. అట్లు గ్రహింపక పోవుటకుఁ గారణము మృగ్యము.

'పరమనాస్తికుఁడనై పాషండవేషంబు
ఘటియించుకొని యేల కోల్గి నైతి' (7-258)

అనుచోట 'ఘటియించుకొని యేల కానసైతి' ఈ పూర్వముద్రణపాదమున యతిభ్రంశము లేదు.

"బందికత్తెలు సురతప్రసంగ వేళఁ
గంచివేతలు కుసుమాస్త్రి ఖడ్గలతలు" (3-109)

పూర్వముద్రణమునఁ "గంచియతివతలసమాస్త్రి ఖడ్గలతలు" అని యుండఁగా వేతల ప్రసంగముగా నేల గ్రహించిరో తెలియరాదు. "బందికత్తెలు సురతప్రపంచ వేళ" యను పూర్వముద్రణచరణమున యతి భ్రంశము లేకయుండఁగాఁ బ్రసంగవేళ యని గ్రహించు టెందులకో దుహూహ్యము.

"ఛేదిల్లెం గులత్మాద్రములల్
శ్రీకంఠుం డవికుంఠవిక్రమమునన్ దివ్యాస్త్రముంగూర్చి"
(4-222)

ఇందలి యతిభ్రంశనివారణమునకై పూర్వముద్రణమున 'ఛేదిల్లెన్ మహీధ్రంబులున్' అని స్వీకరింపబడినది. దీనిని నూతనముద్రణమున నుపేక్షించుటకుఁ గారణ మగపడదు.

'కాశి యణిమాదిసిద్ధుల కాటపట్టు' (2-50)

అని నూతనముద్రణమున నఖండయతి నెలయుచున్నది. 'కాశి యణిమాదిసిద్ధుల కట్టుపట్టు' అని పూర్వముద్రణమునఁ గలదు.

అఖండయతిని వారించు తలంపుతో 'కట్టుపట్టు' యని గ్రహించి యుందురు.

'లక్ష్మి కెంగేలి లీలారవిందంబుఁ
గలయంపి చిలికించుఁ గమ్మతేనె'

(భీమఖండము 3-62)

ఇత్యాది స్థలములం దఖండయతులు శ్రీనాథుని ప్రబంధములందుఁ గనవచ్చుచున్నవి. కావున నఖండయతి శ్రీనాథసమ్మత మగునో కాదో నిర్ణయింపని దే సవరించుట సమంజసము కా నేరదు.

కాశీఖండమున నొండు రెండు చోట్ల శ్రీనాథప్రయుక్తము లని విశ్వ సింప దగనిరీతి నుండుపదములు పూర్వముద్రణమునందును నూతనముద్ర ణమునందును నొకేవిధమునఁ గన్పట్టుచున్నవి. వాని నిటఁ బ్రదర్శించు చున్నాఁడను.

సీ. చిఱుపానఁ బట్టించి చికిలి సేయించిన
గంధగొడ్డలి నిశాగహనలతికఁ
గాఢోన్న నిబిడాంధకారధారాచ్ఛటా
సత్త్రవాటికి పీతిహోత్రజిహ్వ
నక్షత్రకుముదకాననము గిల్లెకుపొంబెఁ
బ్రాచియెత్తిన హస్తపల్లవాగ్ర-
మరసి మింటికి మంటి కైక్యసందేహంబుఁ
బరిహరింపంగఁ బాల్పడ్డయవధి
గీ. సృష్టికట్టిఁ తొలిసంజ చెలిమికాఁడు
కంటివిన తామహాదేవి కొడుకుఁగుఱ్ఱ
సవితృసారథి కట్టిఁ చాయ వేలు
పసగముఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున.

(కాశీ 1-121 నూ. ము)

పై సీసము మయూరుని సూర్యశతకమునందలి శ్లోకమున కాంధ్రీకరణము ఎట్టిరీతి స్వకపోలకల్పితము.

శ్లో॥ శాత శ్శ్యామాలతాయాః పరశు రివ తమోరణ్య వహ్నేరివార్చిః
ప్రాచ్యే వాగ్రే గ్రహీతుం గ్రహ కుముదవనం ప్రాగుదస్తాగ్రహస్తః
విశ్వంభిందన్ ద్యుభూమ్యోరవధి రివ విధాతేవ విశ్వప్రమోదమ్
(వాహానాం వోఽవినేతా వ్యపనయతు విపన్నామధామాధిపస్య)

పైశ్లోకమునందలి మూఁడుపాదములకు శ్రీనాథుని సీసపాదములు నాలుఁగు నాంధ్రీకరణములనుట స్పష్టము. ఇఁక నెత్తుగీతిని బరిశీలింపవలసి యున్నది. ఇందు 'సృష్టికట్టెఱ' యనుచోటను 'సవితృసారథికట్టెఱ' యనుచోటను రెండుసారులు 'కట్టెఱ' పద మర్థభేదము లేకయే ప్రయుక్తమైనట్లు కాన్పించుచున్నది. 'సృష్టికట్టెఱ' యను స్థలమునందు శ్రీనాథుఁడు 'సృష్టికందెఱ' యని ప్రయోగించియుండు నని తలంచుట యుక్తము. 'కందెఱ' యనఁగా తెప్ప. శ్రీనాథుఁడు 'కందెఱ' నే వాడెననుటకుఁ దిక్కయజ్వప్రయోగ మొకటి సాధకముగ నున్నది.

సీ. గీ. అఖిలజగములకందెఱ యనుచు జనస
మాజకరపుటహృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.

(విరాట 2-241)

'అఖిలజగములకందెఱ' యనుదానినే శ్రీనాథుఁడు 'సృష్టికందెఱ' యని గ్రహించియుండు ననుట విశ్వాసయోగ్యముగ నుండును.

వ. ..... భవుని ఫాలలోచను భర్గు భాగీరథీతీరభవను భక్తనిధి భక్తిభావను భావనాసులభస్వభావు భజింతుంగాక యని భవభయోదన్వదుత్తారయానపాత్రం బైన కాశీక్షేత్రంబునకుం జని .....

(3-224 నా. ము.)

బకారాదిపదసంఘటితం బగు పైవచనభాగమున 'ఫాలలోచను' వను పదము కన్పట్టుచున్నది. పూర్వముద్రణమునందును నిట్లే కలదు.

"నిర్గ్రంథన నిరుపాధి నిరవగాథ
నిర్విరోధ నిరాఘాట నిరుపమాన" (కాశీ 3-174)

పదసంఘటనచాతురీధురీణుఁ డగు శ్రీనాథమహాకవి పూర్వోదా హృతవచనంబునందు 'భాలలోచన' పదముసే వాడియుండునా ! యని యాలోచింపవలసియున్నది.

"భవు భవానీభర్త భావసంభవవైరి
భవరోగభంజను భాలనయను"

నిత్యాదిగాఁ గల భీమఖండ (భీమ 3-83) పద్య మీ నాయూ హకు హస్తావలంబన మొసఁగుచున్నది. ఇది శ్రీనాథుని శైలిస్వభావ మున కవిరుద్ధ మగుటయేకాక యత్యంతానుకూల్యమునుగూడ భజించు చున్నదని తలంచుచున్నాఁడను. 'భాల' శబ్దము హరిశ్చంద్రనలో పాఖ్యానశ్లేషనిబద్ధస్థలప్రయుక్తమై మార్పరానిదై వెలయుచున్నది.

"పనమీఱు జేవేల్పు భాలసమున్నతహేతి
యురుబల మదనాశనోగ్రవృత్తి." (హ. న. 6-62)

భాల శబ్దము వాచస్పత్యాదికోశప్రసిద్ధమును నైయున్న దని తత్పీఠికాకర్తగారు వివరించియున్నారు.

పైరీతి నాయీప్రయోగములను జర్చించి కవిప్రయుక్తము లని విశ్వసింపఁదగినట్లు పాఠములను నిర్ణయించి ముద్రణస్ఖాలిత్యముల నెల్లఁ దొలఁగించి కాశీఖండమును సర్వాంగసుందరముగా ముద్రింపవలసియున్న దని విన్నవించుచు నీవ్యాసమును ముగించుచున్నాఁడను.



# చిత్రమాలికలు

రాజేశ్వరి. బి. ఏ., (ఆనర్సు)

కవి తానై సృజించుకొన్న వస్తువునందలి పాత్రలకు మనస్తత్వ శాస్త్రరీత్యా నవ్యత నిచ్చుట ప్రతిభావంతున కెంతసులభసాధ్యమో ఆద్యసత్కథలందలి పాత్రలకు మహాకవి ప్రతిపాదిత పౌరాణిక వాతావరణము చెడకుండ నవ్యతాముద్రనిచ్చుట యంతటి యసిధారావ్రతము. ఈవిధానమున పాత్రచిత్రణ మెంతప్రధానమో పాత్రపోషణమును అంత యనివార్యధర్మమే. పాత్రచిత్రణమున భావయిత్రీశక్తియు పాత్రపోషణమున కారయిత్రియు నధికముగ భాసించును. ఆ రెండు శక్తులును ఏకత్ర సంధింపబడిననే కాని ఆద్యసత్కథలందలి పాత్రలకు లౌకికహృదయ సంపూర్ణాహ్లాదనము నిచ్చుటకు వలనుపడదు. ఆ మహత్తరకార్యకలాప నిర్వహణమునందు కృతకృత్యు లనిపించుకొన్న కవులను వ్రేళ్ళపై లెక్కపెట్టవచ్చు. ఆవర్గమునకు చెందినవారిలో శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారొకరు.

రాజా రవివర్మకృతమైన చిత్రపటములలో ఒక్కొక్క చిత్రమును చూచునప్పుడు ఒక్కొక్కవిధమైన భావావేశము కల్గినదనియు ఆ భావపరంపరల సమీకరణమే ఈమాలిక లనియు కవిగారు కృత్యాదిని తెల్పినారు. కాని ఈ మాలిక లన్నియు ఒకనాటి భావావేశమున ఆవిష్కరింపబడినవి కావు. పదునెనిమిదియేండ్ల యెలప్రాయముననే కవి ఈ మాలికారచన ప్రారంభించి ప్రౌఢనిర్భరవయఃపరిపాకమువరకు (అప్పటప్పట) తద్రచనము అలవోకగా సాగించుచునే వచ్చిరట.

రవివర్మగారి చిత్రపటములు భావమునకు దీటైన చిత్రములు కాగా ఈ మాలికలు చిత్రములను దాటిన భావములు. మూర్తపదార్థాపేక్షారహితమై క్షణక్షణజాయమానచలత్సౌందర్యసంపదచే పాఠకుల హృదయభిత్తికలపై మరువరాని చిత్రములను కవివర్యుడే చిత్రింప

వలయును. ఆవిద్య కైవసమొనరించుకొన్న వారిలో నొకరగు శ్రీ సెట్టి మేష్టరుగారు ఈ చిన్నికావ్యమున దానిని ఋజువుచేసికొనిరి. కావ్యమంతయు చదువనక్కఱలేదు, అందలి ఏయొక్క ఖండికను చూచినను చాలు, అద్దానిని చాటి చెప్పుటకు.

ఈగ్రంథమందలి మాలికల సంఖ్య యేఁబదినాల్గు. వానిలో నధిక సంఖ్యాకములు పసగల శృంగారిమునకు గీటురాళ్లు. అసలు కవివర్యుని జీవితమే ఒక శృగారరసపుంజ మఁట. కావ్యమునం దడుగడుగునను కవి యాత్మీయత మెఱయుచునే యున్నది. కవి తానై యావిష్కరించిన భావ ప్రదర్శనమునట్ల నాత్మవంచన మించుకైనను చూడము. ఆర్భాటము లేనిశైలి, అతిశయోక్తులు లేని పలుకుబడి, అతిమాత్రమైన మాధుర్యము ఆకవిత్వమునకు నొరవళ్ళు దిద్దినవి. అంతియకాదు; ప్రసిద్ధపదములతో కూడిన యలఘూక్తులు రచనకు ప్రసాదమును ప్రసాదించినవి.

ఇందలి ప్రతిమాలికకు నిరువదినాల్గు పంక్తులు కలవు. అం దెత్తిన ప్రాసము నెత్తుకొనలేదు, చెప్పినభావమును చెప్పలేదు, చెప్పఁదలఁచిన దానిని విడువనులేదు. అవన్నియు మాలికారూపముననే యున్నను అయ్యవి సుదీర్ఘములు కాకపోవుటవలనను తద్గతమైన ఛందస్సు ప్రక్రియా వైవిధ్యసముల్లసిత మగుటవలనను చదువరులకు విసుపుపుట్టింపవు, సరికదా జౌత్సుక్యజనకములుకూడ నగుచున్నవి. అదికాక యొక్కొక్కరకమైన మాలికతో కవి ఒక్కొక్కవిధమైన రసోచితమగు ప్రయోజనమును సాధించినట్లు తోఁచును. వీణాక్వాణపాణింధమంబైన మృదువాణి వాణి రూపును, దమయంతి శృంగారరామణీయకమును, రత్నావళీవసంత సేనాది యువతుల శృంగారభంగిమలును ఉత్పలమాలికలకు కానుకలైనవి. మత్స్యగంధీ రూపగంధమును, శృంగారసర్వస్వమును కైవసమొనరించుకొన్న వలపులపతాకయగు రాధిక చిత్రమును, మనోరమా మనోహరాకారమును చంపకము లందుకొన్నవి. నాకమృగీనేత్రలలో

పేరుగన్న నట్టువరాలు తిలోత్తమమాత్రము పంచచామరములో ప్రదర్శింపఁబడినది. ఉత్తుంగతరంగములతో కాలాబ్దములీల గర్జిలఁచువచ్చు గంగాప్రవాహాది ప్రళయదృశ్యములు శార్దూలములతో ప్రతిభటత్వము నందినవి. అట్లే ఇందలి ఛందస్సు సాభిప్రాయమై భావోపలక్షకమగుటచే ప్రతిమాలికయు నొకవిధమైన ప్రత్యేకత నార్జించుకొన్నట్లు తోఁచును.

ఈమాలిక లన్నియు గతిగాంభీర్యము నార్జించుకొన్న భావప్రధానములే. తత్ప్రతిపాదనమున కవికి చిత్రపటములు నిమిత్తమాత్రములే యనక తప్పదు. ఈకవి ఔత్సుక్యమునకు ఆయువుపట్టులైన కొన్ని సన్నివేశములను పురస్కరించుకొని ఒక ప్రత్యేకమైన వాతావరణములో తద్గతమైన పాత్రలకు రూపమునిచ్చి అతిమాత్రముగ రసభావములను చిలికించి విడచును. ఆ ప్రభావము పఠితల హృదయమున ఆవేశించి సరాసరి చెప్పని కథలోని కీడ్పుకొనిపోయి "రసమఁల్ చిప్పిలుచోట" విడచును. ఆవిషయములు చదువుట మాఁపిన యెంతసేపునకోగాని పాఠకునకుఁ దెలియదు. అనఁగా చదువుట ముగిసినను పాఠకునిలో రసతత్పరత ముగియదన్నమాట. అట్టి కొన్ని ఖండికలను కొలఁదిగ పరిశీలింతము.

## నికుంజ రాధ — యమునాతట రాధ

మధురభక్తి కించుమించుగ నటీపాత్రధారులు రాధామాధవులే యని బహుజనాభిప్రాయము. బ్రహ్మవైవర్తపురాణములో రాధ ప్రకృతి. మాధవుఁడు పురుషుఁడు. కాలవాహినిలో వారిగతులు మారుచు వచ్చినవి. ఆ ప్రకృతిపురుషుల లీల కాలాంతరమున కొందఱి కవుల దృష్టిలో కేవలము లౌకికానందముగా పర్యవసించినది. దాక్షిణాత్యుల పాఁడబడువఱకు రాధామాధవుల ప్రణయానందము విగళితవేద్యాంతరమైన లౌకికానందమే. ఆయానందము భౌతికకక్ష్యాంతరములను గడచి యెటనో నిలచును. అస్థాయి సామాన్యుల కందునదికాదు.

రాధిక 'రసార్ద్రితపు పేర్వోఢ మానిని' మాధవునికై ఆమె యార్తి సడలువారనిది. విసిమిక్కిల్గిన యీ రసరాజు ఉపగూహనములో మలపులుతిరిగిన వాసంతలతిక రాధ. మాధవుఁడు వెనుకదిరిగిన రాధిక విరహపడును. రాధికాహాసజ్యోత్స్నకు మబ్బు క్రమ్మిన మాధవుఁడు క్రుంగిపోవును. 'ఆ ప్రవిమలాధికసారకృతావగాహములు', 'ఆ ప్రేమా వినోదానూనసభవమ్ములు' తేనియలూరు నారజపు వింతరహఃప్రసంగములు వారికే చెల్లినవి.

అసలు కృష్ణునకు శృంగారరసరూపము నిచ్చి తీర్చి దిద్దుకొన్నది రాధ. తానై సృజించుకొన్న ఆ యుదాత్తప్రణయవాహినిలో నిచ్చలు దేలియాడు కలహంసి యీమె. తిథులన్నిట సంపూర్ణచంద్రికావికాస మొక్క పూర్ణిమకే యబ్బినట్లు కృష్ణవిరహసంతప్తహృదయ లందఱిలో ఆరసానుభవయోగ్యత సంపూర్ణముగ రాధికకే దక్కినది. తరువాత కృష్ణుని ప్రేమరసామృతధార గ్రోలిన సారసలోచన లందఱకు ఆమె పెట్టినదే భిక్ష. ఆప్రణయపుతీపు లెట్టివోగాని సమక్షములో నున్న మాధవుఁడు పరధ్యానముగ నున్నను రాధిక విరహపడును. కావుననే ఆమె స్వాధీనపతికయయ్యు విరహోత్కంఠిత యగుచున్నది.

ఆ లతానికుంజములలో యదువంశహాళికై యెదురుతెన్నులు చూచు ఒకనాటి రాధిక-హారపదాంగద ప్రముఖపాణియై, ఎఱ్ఱకలువ పూరంగుచీరతో తపనీయాచల మందిరద్వారము దాటి ఆ లతానికుంజములలో కృష్ణమార్గగతవీక్షణపంక్తులు క్రొవ్వక నిరీక్షణలో మునిగిపోయినది. నవవికసిత పుష్పనికుంజములలో కృష్ణుఁడులేని రాధ తావిలేని పూవు. కృష్ణుఁడు రాడు ఆమెకు ఊరట లేదు. లతామతల్లికలు వెల్లివిరిసినవి. మందసమీరణము వికసితకుసుమములకు చెప్పుకొనమరిన చుట్టమైనది. అటు చూచినది రాధ- శారిక, మదనసూత్రములను స్వకీయశారికలకు తెల్లము చేయుచున్నది. గువ్వ, పావురము, జక్కవ,

నెమ్మి- అన్నియు; నొక్కొ- సారియే వేసిన కేక లోకపెనుగొల్లుగా పరిణమించినవి. రాధికావపువు దేహవల్లి కుంచితమై కంపించినది. వెంటనంటిన గోపికలను కాదని కృష్ణుఁడు వచ్చుజాడ లేదు. అట నిలువలేక చకితకురంగిభంగి దొంకతీరుగా యమునాతటికి భారముతో సాగినది.

అది యమునాతటి. హిమకర సైకసైకతస్థలము. రాధిక విరహాపడినది. "ఇప్పుడే బిరాన వత్తునని యేగిన ముద్దులకృష్ణుఁ డేటికి వృథా జాగుసేయుచున్నాఁడు. తపనుఁడు క్రుంగినంతనే తప్పక వత్తునని శపథము చేసినాఁడు. అక్కటా! జామయినం జనుదేరఁడయ్యె" అని రాధిక బాధపడినది. కాని కుపితమాత్రము కాలేదు. అది ఆమెలోని ప్రత్యేకత.

విరహవ్యథాభరవివశాంగియై సఖిని బిలిచి 'చెలీ! వెన్నుఁడు కఠినుఁడు కాఁడు. కృపగలవాఁడు' అన్నది. ఎంత యోగ్యమైన భావము. అప్పట్టిన ప్రబంధనాయికలవలె ప్రియుని దూషణమును, అంతతో నాఁగక పరదూషణమును, అంకించుకొన లేదు-'అపరిమితానురాగమున వాలలనా పంచబాణుని గోరి గొల్లపడఁతుకలు తిరుగులాడుచుందురు. కాని సఖీ! మాధవుఁడు తనంత తాను చపలుఁడు కాఁడు' అన్నది ఇంచుక భారముతో. ఆమాటలలో ప్రియునిపై నమ్మకము, ఆ మాటల మాంద్యములో తన విరహభారము, తోడి వల్లవీకాంతలపై సానుభూతి తొణికిసలాడుచున్నది. అంతియే కాదు, అచ్చముగా ప్రణయమున 'మగఁ డింతులకు చనవిచ్చి పుచ్చుకొన్నను' మనవచ్చునని ధ్వనింపఁజేసి తన ప్రేమకు నుత్తమత్వమును సంపాదించుకొన్నది రాధిక.

ఊరకే- ముమ్మరమైన తాపమున మ్రగ్గినది. మరుక్షణములో నాయికోదాత్తత్వము స్వార్థస్పర్శకు లోనై గుణీభూతత్వము నందినదేమో యనిపించును. తనలో తలపోసికొనినది. "తొలిసంజ విరిసేటి" పూల సౌరభవమును తలయెత్తి తలఁపనేలేదు. ఈ నిశీథినీ యమునాతరంగముల పాయుగనుకూడ భంగపడవలసినదేనా. ప్రణయమూర్తిహృదంతర

నీమయందు తపములెన్నో చేసి నిను గడించుకొని నేఁడు చేతులార వల్లవీ కాంతల కిచ్చుకొంటినే', అని రాధిక గాసిలి కందువారి, యమునాతటి వీడి సాంద్రచంద్రి కదళీపాళింతేందు కాంతస్థలిలో కాలాడక యటనే నిలిచిపోయినది. వేణువు సవ్వడిసైనను లేదు. ఆ లీలావిర్జిత మన్మథుని తలఁచుకొని 'తెలియవైతివిక దా,... అలనాఁటి దృశ్యమానమానస ప్రమదార్ద్రభావములను' అని ప్రేమాశ్రువులు తోరంబుగా జాలువాఱ వాపోయినది.

## సైరంధ్రి

సురాపాత్రధారిణియై కీచకునికడకుఁ బోవు ద్రౌపదిచిత్రమును చూచునప్పటి కవిహృదయభావసంచలనము ఈ మాలిక.

లౌకికదృష్టితోఁగనుక భారత ద్రౌపదిని చూచితిమా, ఆమె బ్రతుకే ఒక దుఃఖసాగర మనక తప్పదు. ఏ జన్మలో చేసిన పాపమో కాని తత్ఫలానుభవమునకే ఆమె భరతవంశము చొచ్చినదేమో యని పించును. అపరితృప్తహృదయకుహరమున మానవసహజమగు వాంఛ యేదైన నున్న యెడల నది ప్రతీకార వాంఛ తప్ప అన్యము కాదు. ద్రౌపదీ జీవితదుఃఖసాగరమున ముఖ్యముగా మూఁడు సుడిగుండములు పొడసూపినవి. ఒకటి వస్త్రాపహరణఘట్టము. రెండవది కీచకునిచే పరాభవింపఁబడినసన్ని వేశము. మూఁడవదియుపపాండవవధ సందర్భము. ఈమాలిక ద్రౌపది రెండవ సుడిగుండముఁ జేరఁబోవునప్పటిది.

అసలు భారత ద్రౌపది నిత్యచైతన్యమూర్తి. ముగ్ధత్వము పేరిట జడత్వమును వహించుట యామెకు చేతకాదు. పాతివ్రత్యము పేరిట పతులకు పిరికిమందు లిచ్చుట గాని, తానై యవినీతికి ప్రోత్సహించుట గాని ఋదకు సహించుట గాని యామె యెన్నఁడును చేయలేదు. యాజ్ఞసేని శీలము ఒక్క వాక్యములో చెప్పవలయునన్న ఋజువర్తనమే పాతివ్రత్యమని ధర్మసూత్రములలోని పాతివ్రత్య మను మాటకు వివరణము, అనవలయును.

కీచక పరాభవాగ్ని హృదయమును దహించుచున్నను నోరుమూసికొని పడియుండక సమయభంగము కానిరీతులో పతులకు విషయము మెఱిఁగించినది. ధర్మజునకు తెలియునట్లు చేసినది. అర్జునునకు సూచించినది. పతుల శక్తులామె యెఱుఁగనివి కావు. వారు ధర్మైక బద్ధులు. అప్పటున నామె యాశ ఒక్క భీమసేనునిపైనే. భీమునకు విషయము సామాన్యముగ తెలిపి యూరకుండదులేదు. హెచ్చరించి పురికొల్పి శాసించినది. ఆ హెచ్చరిక భీమహృదయమున నేమూలనో అణచి పట్టిన నాఁటి పరాభవాగ్నికి ఆజ్యధార. తోడనే దరిగొన్న భీషణ హుతాశన కీలమైనాఁడు భీముఁడు. ఆసన్నవేళ మఱియొక్క ఫలితము ఇంచుమించుగ నాఁడు కీచకుని చంపుటకుఁ బ్రతిన పట్టించినట్లైనది. అట్టి ముమ్మరమైన దుఃఖసమయములలో ఘోరప్రతిజ్ఞలు పట్టుట ద్రౌపదికి చెల్లిన యలవాటు. అవి తీర్చుట సమర్థుఁడైన భీమునకు సాగిన పరిపాటి. అసలు భీముని యుండ జూచుకొనియే యామె అట్టి సాహసములకు పూనుకొనుట.

కీచక వధోపాయము నిర్ణయించుకొని వెనుకకు మఱలినది ద్రౌపది. ఎంత కట్టుదిట్టము చేసికొన్నను కార్యము సాగువఱకు నమ్మకము లేదు. ఎఱిఁగియు సుధేష్ణ ద్రౌపదిని కీచకాంతఃపురమున కంపును. గంధగజేంద్రతుల్యబలగర్వ సమేతులైన పతులేవురు చెంతనుండియు నప్పటున నామెకు లేనివారే యైరి. కీచకుఁడా కామాంధుఁడు. చెనటి. అప్పటికే సుధేష్ణను చూచు నెపమున వచ్చి యేవేవో వెడమాటలాడి వెడలినాఁడు. అట్టివాని గృహమే తాను చేరిననాఁడు 'వాఁడు రేగక మానఁడు' అది యెఱుఁగును ద్రౌపది. కాని గత్యంతర మేదీ. కంచెయే చేను మేసిన దన్నట్లు ఎవరి దరిఁజేరి మానము కాపాడుకొన నెంచినదో ఆ యేలిక సుధేష్ణయే తానై యీవలి కంపినది.

పన్నుగడ సాగువఱకు నమ్మకము లేదు. "భీముఁడు రానిచో!" ఆమాట తలఁచికొన్న హృదయము కంపించి ఆ సబలకు నబలత్వమే ప్రత్యక్షమైనది. తనపని క్షణములో నేమికానున్నదో చూచి చూచి యాపని కేగుట సాహసమే. మహావిపత్సంకటము నెదుర్కొనుటకు పానపాత్ర నందుకొనినది. కంపించు చేతులు, తడఁబడు కాళ్ళు, దిగజారు హృదయము, రాజసూయాధ్వరమున నవభృథస్నానముచే పవిత్రమైన శిరోజములు దుశ్శాసన హస్తస్పర్శచే నిదివఱకే అపవిత్రమై విశీర్ణమై కటిని జిమ్మచీఁకటులు గావించినవి. మహారాజ్ఞియాజ్ఞ—పోక తప్పదు—ఏకాకిని. పుట్టిననాఁటినుండి నేఁటివఱకు 'తనుమునుబద్ధ బన్నములు' ఒకదాని వెనుకగా నొకటి స్ఫురణకు వచ్చినవి. అక్కటా! బాల్యమున కన్యగా నున్నప్పుడు పెండ్లికాదనెడి చింత— తరువాత ఐదుగురి కిల్లాలినై చిక్కుపడు టెట్లనెడి చింత— అది తీర మాయజూదము— తరువాత వస్త్రాపహరణమే. 'పండ్రెండేండ్లు తేజోబలప్రాధాన్యమ్ము గలట్టి రాచకొదుకలు ధర్మంబని కానకేగ' నట తగని యిడుమలు పడి నేఁడు సనాథనయ్యు అనాథనై విరటుని కొల్వులో నీచుఁడైన కీచకునిపాలబడవలసి వచ్చినది. మరల ఆ శ్రీకృష్ణుఁడే గతి. కృష్ణా! ద్వారకావాసా! కృపాసాగరా!" అని ఆక్రోశించి, ఆభీమసేనుఁ డిదివిన్నను లేవడాయనుకొన్నది. భీముఁడు లేచుటయే కష్టము కాని లేచినా కార్యము సాగును. అసలు ఆ లేచుట యెట్లనునదియే ప్రశ్న. 'నిన్నటి సంగతి నేఁటికి ప్రాతవడ్డదేమో! ఆయుదేరికము చల్లారెనో', "ప్రతిజ్ఞ చెడు ఎట్లుం బూర్వకష్టంబు లింకొకమాత్రొందక తీరదు" అని అనుకొన్నది అప్రయత్నముగ. దీర్ఘముగ నిట్టూర్చినది. బహుశః అలనాఁటి జయద్రథుఁడు మరల స్మృతిపథమునఁ బడినాఁడు కాఁబోలు. దుఃఖము పెల్లుబికినది. బాష్పధారలు దృష్టినిరోధము గావించుచున్నవి. కదలక తీరని సమయము. "సింహమున్నకడం జేరు కరేణువట్టులు అతి మందంబైన యానంబు సాగించిన" దఁట ఆ సాధ్వి.

## దమయంతీ హంస సంవాదము

ఇది దమయంతి హంసిని బట్టి హృదయగుంఫితమైన ప్రియుని విషయమై ప్రశ్నోత్తరములు జరుపు రసవద్ఘట్టమునకు భావచిత్రము.

దమయంతి యనఁదీరిన బ్రహ్మగారిచేతి చాతుర్యనిదానము. ఊడేరిన రాచబిడ్డ. నలుని గోరిన నలినానన. అవ్యక్తమైన వలపు పెద లోలోన రొదసేయు కూనవయసుసుందరి. లలితోద్యానమునఁ బూలతోఁ బూవై సంచరించు హంసిని ప్రీతిమెయి పొంచి పట్టఁబోవును. అది సామాన్యపురాయంచయా! నలునికడనుండి వచ్చిన దూతిక. దౌత్యనిర్వాహణమున శుచిముఖిచిత్రరేఖాదులను మించిన నెఱజాణ.

హంసికార్యనిర్వాహణము అత్యద్భుతము. తా నా కార్యార్థినియై తనుదాన దమయంతికడకు వచ్చినది. అది యెఱుకపఱుటకు వీలా? తటస్థభావము వహించి దమయంతిని జూడనట్లె యందు సంచరించుచున్నది. విదర్భరాజపుత్రి చాతుర్యము కలదియేకాని దౌత్యపులొల్కముల నెఱుఁగనిది. ఇంతకును నామె దౌత్యము నందవలసినది. అందవలసినవా రందలి సారస్యము నేకాని, యందించుటలోఁ జమత్కారముల నెఱుఁగుట యరుదు. పాపము! హంసిని బట్టఁబోయినది. నెఱజాణపులుఁగురాణి తటాలున మింటిపై కెగసి యందనియెత్తున నిలిచి నెమ్మియతయు దమయంతిపై నిడి, 'యోహో! చలనేత్ర! నా ఱెక్కలలోనఁ గల పసిఁడి నపేక్షించి నన్నుఁ బట్టఁ దలఁచితివా?' యని యారాకుమారిపై దోషారోపణ చేసినది. అంతతో నూరకుండక 'మఱి నీతనూకాంచనమందు వాంఛపడి వచ్చెడివారిమాట యూహించితె' యని మిక్కిలి నేర్పుతో ముందఱికాళ్ళకు బంధము వైచినది. హంసి పేర్కొనిన దమయంతివాంఛ తనఱెక్కలలోనఁగల పసిఁడిమాత్రమే. మఱి యా హంసియుద్దేశించిన దమయంతీసంబంధమైన వాంఛ యామె (దమయంతి) తనువంతకును జెందినది. ఇఁక మన నన్నమాటయు నందు గతార్థమే.

ఆ భావావిష్కరణ మట్టిది. మొత్తముపై హంసి యెత్తుకొనిన దమయంతీసంబంధమైన వాంఛను విషయ మూ మొసర్వస్వము నని.

దమయంతి యప్పటికి హంసియొక్క యాగమనరహస్యము నెఱుఁగకపోయినను యుక్తికిఁ బ్రత్యుక్తి నెత్తఁగల్గుచాతుర్యము కలదియే. కోడనే "మరాళమ! నీ సువర్ణ మాసించుట లేదు. నీరములు క్షీరములు చేర్పడఁజేయు నీవు నా మంచియుఁ జెడ్డయు నేర్పఱచుటమాత్ర మెఱుఁగవే" అనినది. ఉక్తిమాధుర్యము యుక్తిచాతుర్యము రెండును నొకదానికొకటి యీడుతీయని సమాధాన మది. హంసి చెప్పినట్లు తను వెల్ల బంగారమైన దమయంతికి హంసి ఱెక్కలపసిఁడి యొకలెక్కయా? ఇఁక రెండవవాక్య మతిచమత్కారాసహము. 'నేర్పరితనమున నీవు ప్రసిద్ధురాలవు కదా! ఆ నేర్పు నా సామాన్యపుభావము నెఱుఁగుటకైనఁ జాలలేదా?' అని హంసిని ప్రశ్నించి యుప్పు తీర్చుకొనినది.

ఆ సమాధానములో దమయంతినెట్టనము హంసి కవగతమైనది. వెంటనే మఱికొంత గడసరితన మవలంబించి సూచ్యార్థసూచనముగ "చానరో! నెన్నడలందు నీకు మాయంచకొలంబువారలకు వారని వైరము. కావునఁ నను వెంచన చేసి పట్టుకొన వచ్చితివి. ఇంత యెఱుఁగవా?" అని విదర్భరాజపుత్రికి హంసకులంబుతోడి బాంధవ్యవైరుధ్యాభాసమును నిపుణముగ జెఱిఁగించినది. ఆమాటలలో దమయంతినిగూర్చి నీవు హంసనడకలు గలయందకత్తె వని చెప్పుచు నాయందము మానుండియే నీకు సంక్రమించిన దనుటలో గర్వరేఖ యుంచుక మెఱయించినది. ఆ భావగాంభీర్యము దమయంతి కవగతమైనది. నడకలో సామ్యమునకే యింతగర్వమా యని కాఁబోలు దమయంతి యులఁతిగ నవ్వి "మీనడకలకుఁ సరి లే దని సృష్టికర్త మన్నించుచునుండ మీపయి నే పగగొందునె; నిన్నుఁబట్టి నే పెంచఁదలఁతుర" మ్మనినది. హంసి రాకుమారిచూపిన ప్రతిబంధిరచనాచాతుర్యమున కబ్బురపడుచు సమయము చూచుకొని యుత్తరరంగమునకుఁ దెర నెత్తఁదలఁచి "నీవు నన్నుఁ బట్టి నీకడనే నిల్పుకొనిన" — అని కొంచె మాఁగి

దూమెవైపు చూచి, మరల నాఁగి యాతురత రేకెత్తించి- "నలుఁడను నృపుం డొకఁడు నిషధావని నుండు (నీకుఁ దెలియదు లే.) అతఁడు నన్నుఁ బ్రేమించిన చుట్టము. అట్టి మా చెలిమిని బలిమిగాఁ దెగ తెంపు చేయ నెంచితివె!" అని యయ్యాదనపుఁబము నెఱిఁగి దమయంతీహృదయ బాంధవునితోఁ దనకుఁగల బాంధవ్యమును జెప్పి యతఃపూర్వమే నిక్షిప్తమైన వలపుబీజమునకు జీవము చిలికించి విడచినది.

దమయంతి రాచరికపుఁజాతుర్యమున కీయెత్తుగడ స్థాయి యందినది కాదు. ఆమె హృదయరాగవిపంచీరాగము నలనామస్మరణముతోఁ బంచమస్థాయి కెక్కినది. ఆశ్చర్యముతో "నెట్టటూ! జగత్పంచశరుఁడు నైషధుని ప్రాణపదంబవె! రావె! విన్నించుకైనను గస్తి పెట్టనుకదే! దిగి రాఁగదె. మత్స్యంచికాపుణ్యాసంచయముచాప్పనఁ దోఁచుచు నుంటివి" అన, నాపగ యానకట్టు తెగ నాపగరానివిధంబునఁ బొఱలినట్లు వఁపువాహిని వెల్లువయై పాఱినది. ఆ ప్రవాహపుటొడుదుడుకులలో హంసి విదర్భరాజపుత్రి కట్టంతయుఁ గూడఁగట్టుకొనినది. కొలికలో ముడిపడిన దనుకొని "అమ్మయ్య! నలరాజుదూత యేతెంచిన కార్యమైనట్లే" యని సిబ్బరపడినది.

## అహల్య

ఇది రామపదధూళిచే నహల్య శిలారూపము వీడి మానవరూపమునం దున్నప్పటి చిత్రమునకు భావము.

అందాలరాశి యహల్య. వహిఁగల యందకత్తియలమాటల కేమి యప్సరోమహిళలలోన సేసియు నామెకు సరివారు 'నహి' యఁట. ఆ సొగసు నారసి హరిహరప్రభాకరులు మనోవికారముల నందిరఁట. ఆ తిహాతిహాపాట్లను నతిశయోక్తికి విడచినను అహల్య యందకత్తెయనుట స్వభావోక్తికి దూరముకాని మాట.

గౌతముఁడు 'వసిష్ఠుని వాక్యప్రకార' మహల్యాకరగ్రహణ మొనర్చి గృహమేధి యైనాఁడు. రూపమునకు వన్నె దెచ్చు గుణవతి

యహల్య. "పతి యేరూపము దాల్చినఁ దదనురూపం బైనరూపంబుఁ గో" నాతనికి సరియగువాటము జేర్చికొనినది. బ్రహ్మజ్ఞానియైనపతికి సౌఖ్యముఁ గూర్చుటలో నాసతి కొకతృప్తి. తదీయపదసరోజములరజము నరుంధతివోలెఁ దలఁదాల్చి యనిర్వాచ్యమగు నానందము నందును. పతి యలసిన నామె యనురాగము మందమారుతమై తద్గ్లాని వాపును. ఆ తుహినకరాస్య తూరుపు వేగకమున్నె స్నాన మాచరించి భర్తృహితవుఁ గోరి బాలచంద్రు నపహసించుఫాలభాగమునఁ గుంకుమరేఖ దిద్దును. దేవపూజనసక్తహృదయనాథునికై రమ్యసుమమ్ముల సేకరించును. పతి రాకమున్నె శుచియై దేవతాగృహమున ధూపదీపముల నమర్చును. తపసి తనియించు నిండుహృదయముతో నహల్య దేవతాగృహములో నొకదేవతయై విరాజిల్లును.

ఆ నొసటి కుంకుమరేఖ సొంపును దలయెత్తిచూచిన పరపురుషులు పసిబాలురే యగుదురో, యారమ్యసుమమ్ముల నేరునప్పటి యామె చెలువమును జపలచిత్తముతోఁ గాంచిన మగవాని రూపరి పోవునో యనిపించును. ప్రత్యూషము మునివాటికారామసుమమ్ముల నేరు నహల్యపైఁ దన కరగ్రహణప్రసారము గావించిన యాపతివ్రతామతల్లి కినిసి 'నీ పరిభ్రమణము చాలు నింక నాఁగు' మని యెక్కడ శాసించునో యని దినకరుఁడు మందముగా సాఁగునట్లు తోఁచును. ఆ ప్రాంతభూరుహముల నానుకొని కురుల తడియార్చు నహల్య ప్రసన్నవదనముఁ గాంచిన జన్మజన్మాంతరపాపఫలము వాసిపోవునఁట.

గౌతముఁడు బ్రహ్మజ్ఞాని. అహల్య యానందమయి. అతఁ డాశ్రమవాటి గోవత్సములను వాత్సల్యము మీఱ నిమురును. ఆమె బాలహరిణములఁ జేరఁ దీయును. అతఁ డటనటఁ దిరుగుమార్జాలమూషికములకు నీవారాన్నకబళ మిడును. ఆమె శుకశారికలకుఁ జదువుచెప్పుచు బర్హిసంఘములకు మురిపెమును గఱపును. గౌతముఁడు సమిధల కరుగ, నహల్య నీళ్ళకడవ చేకొనును. అతఁడు నిత్యాగ్నిహోత్రము వ్రేల్చును.

ఆమె పాకకళలో నైపుణి చూపును. నాఁటి యహల్యాగౌతములవాటి శాంత్యానందముల సంగమవాటి. ఆ ప్రణయ మేకైకకామానుభవ నిబద్ధము కాదు, మఱి, రజోగుణలేశము సోకని సాత్త్విక ప్రేమసంపద.

స్త్రీత్వము చిక్కనిది. అందును భారతనారీమణిశీల మతికోమలము. ఆశీలము కళంకితమైనపట్లఁ బని యితరుల తప్పైనను బొరపాటైనను, బాల్యమైనను, చాపల్యమైనను శిక్షమాత్ర మొక్కటే. అది స్త్రీయే తానై తెలిసికొని యనుభవింపవలయును. అందుచేతనే యా శీలమున కంటె విలువయు మహత్త్వమును నబ్బినవి.

ఆమె జన్మాంతరార్జిత పుణ్యవిపంచీనాదమున నెటనో యపశ్రుతి ధ్వనించినది. ఎవరికో కల్గిన పాపపుఁజింత యహల్యను గట్టిపడిపినది. జంభారివాంఛలోని యనౌచిత్యము, గట్టుకొన్నవానిలోని కాఠిన్యమును, బలీయమైన విధియు నహల్యను గండశిలను గావించినవి. అనంతమైన కాలవాహినిలో వాసరములు నెలలు వత్సరములు నెన్నో యజ్ఞాతముగాఁ గడచిపోయినవి.

* * *

త్రోవతప్పిన పూర్వపుణ్యసంచితపుష్పకోరక మొకటి కాలవాహినిలో నరవిచ్చినది. పూతమైన రామపదధూళి సోకి రాతికి నాఁటిచిహ్నములు రాఁజొచ్చినవి. గుండ్రతిపై నాచు హెచ్చై తెగబాఱ్పై నిబిడమై నెఱిమబ్బునుబోలె వేణి యొప్పెనదఁట. ఫాలభాగము చంద్రునిలోఁ బాతికపాలై సగబాలై పూర్ణబింబమై యమరినదఁట. కన్నులు వాతెఱ నాసిక మొదలగు నవయవములు క్రమముగాఁ "గళాధాతుకి కోడ శిల్పము సల్పిన చక్కని రాతిబొమ్మయే నాఁటిగ నైనయట్లు" చెలువము నందినదఁట. అనకారమూర్తి లక్ష్మణుఁడు క్షణమాత్రము సర్వము మఱచి యబ్బురపడినాఁడు. పరమేశ్వరుఁడు శ్రీరామచంద్రుని యానన సీమపై నల్లన చేతనవ్యాకటి మెఱసినది. బహుశః మానసధ్యానతత్పర్యాయి యహల్య యాంతర్యము నెఱిఁగికొనియుండును.

'కలఁగని యంత మేలుకొనవచ్చితె యు'ట్లహల్య కనుఱెప్పలు మెల్ల మెల్లఁగ సల్లలాసినవి. అది జాగ్రత్స్వప్నములకు మధ్యావస్థ. హృదయ వీణలో నేదివ్యతంతువో స్పందించినది. పరిసరమంతయు దివ్యతేజో మయము. ఆమె కన్నులనుండి యెడతెగని బాష్పధారలు జాలువాఱు చున్నవి. అది దుఃఖమో సంతోషమో యెవరికెఱుక. చేమోడ్చి పులకితగాత్రియై భక్తిపారవశ్యమున నాదివ్యజ్యోతినిఁ గూర్చి యేమే మియో పల్కినది. ఆకంఠధ్వనిమాత్రము పరమాత్మతో నెడబాటు గన్న జీవాత్మ యార్తివలెఁ దోఁచును. "ఓ గుణాభిరామ! నిర్హేతుక జాయమానకృపతో (మరల) నన్నొకయింటిదానిగఁ జేసితి" వెందుల కన్నట్లు దైన్యముగఁ జూచినది. కఠినబాధలములకుఁ గందువాఱిన కోమల జీవితముకంటె జడత్వమే నయమనిపించినది కాఁబోలు. అణచిపట్టిన యావేదన మాఁగక యశ్రురూపమున దిగజాఱినది.

మఱుక్షణములో మాయ క్రమ్మినది. అహల్య పూర్తిగ చైత న్యవతియై లౌకికదృష్టితో రామలక్ష్మణులను జూచె వారు ముద్దులు మూటగట్టు చిన్నిబాలురే. వాత్సల్యముపొంగార నామె కళ్యాణో న్ముఖుఁడైన రాముని జేరఁజీరి "బిడ్డా! పెండ్లికొడుకవు క" మ్మని దీవించి నది.

ఇట్లీ యిందలి శీర్షిక లన్నియు ధ్వనిగాంభీర్యసముల్లసితములై యొకదానికొకటి యానుతీయని తీగలో నున్నవి.

ఇందు వాడుకలోనున్న కొన్నిపలుకుబడులు తగుమాత్రము సంస్కరింపఁబడి క్రొత్తశక్తిని గడించుకొన్నవి. 'నాకళ్లకు హృది గుమ్మినట్లు- మిసమిసలాడునట్టి విలాసము- గొప్పలేవో చెప్పెను గాని నైషధుని పొత్తే లేదో!- మన్మథుని పంచాంగంబు దున్నవా!- మగకచ్చ కట్టుకొన్నను- బుడబుడక్కల వేసములనటుల్- బొజ్జను గోడుపిడ్డలు'- మొదలగునవి.

ఒక ఖండికలో నాయకుఁడు 'రసికతయందు నూత్నమకరధ్వజుఁడఁట- ముక్కాకం జెందిన యొక సొగసులతొలతన్వి ప్రచండమైన భాస్వంతుని యెండవేడిమికి వాడిన మవ్వపుఁదీఁగెయఁట'- ఒక పరితప్తహృదయుమును వర్ణించుచు "గజగజలాడు మేను సధికంబగు నార్తికి గుర్తులై చెలంగ జమునిధంగి నేడ్చె" ననినాఁడు.

అటనట శ్లేషచమత్కృతికూడ మెఱపినది. సముద్రగర్వాపహరణము శీర్షికలో నది స్పష్టము. శ్రీరాముఁడు రత్నాకరుని దారి యిమ్మని వేయిరీతులుగఁ బ్రార్థింప సముద్రుఁడు "డస్తినాస్తి" యనక మౌనముద్ర వహించును. శ్రీరాముఁడు కోపోద్రిక్తుఁడై "నిలువెల్ల విసము భంగంబుల్ సదా చేయు జీవనమన్నన్ కలుషాలవాలము- దోషాచర దర్శనంబున నీ యుప్పొంగుల్ గదా" యని శ్లేషగర్భితముగ నిందించును.

ఇఁకఁ గొన్నికొన్నిచోట్ల భావము లపూర్వములే కాదచుంబితములుఁగూడ. దమయంతి లేఖ వ్రాయునప్పటి యామెమోమో మరకేసిన నవ్వుమోమఁట! పోవ నిష్టము లేకయుఁ బోక తప్పనియవస్థలోఁ బోవుచున్న దమయంతి గమనమును వర్ణించుచు 'మందయానముల్ దక్క మఱొండురీతి గమనంబు నెఱుంగమి సాఁగుచు సాఁగుచు నేఁగిన' దఁట. ఆసాఁగుడులో సనిష్టత స్పష్టము. నిరస్తభూషమైన మనోరమ రూపము 'పుష్పతతులనెల్ల రాల్చిన మవ్వపుతీఁగ' యఁట!

"శ్రీ స్కెట్టిమేష్టరుగారు" లౌకికమనస్తత్వములను బ్రదర్శించుపట్లఁ జూపిన శిల్పనైపుణ్యము రసికులచేఁ దల లూపింపక మానదు. అట్టివి కొన్ని.

ఆకాశవాణి పలికినది. శకుంతలాదుష్యంతులకుఁ బునస్సమాగమము సిద్ధించుసమయ మిది. అప్పుడు దుష్యంతుఁడు శకుంతల నింతవఱకు గాసిపెట్టితినే యని పశ్చాత్తాపసంకలితదుఃఖమును మరల నామె సాన్నిధ్యభాగ్యము లభించినందులకు సంతోషమును నొక్కసారియే

పొందును. శకుంతల భర్తృతిరస్కృతయై క్రుంగినహృదయమును గుదిపట్టి గృహోన్ముఖి కానున్న సమయములోఁ గలహాపమెఱిఁగినఁ బతిసన్మానము లభించును. కనుకొలుకులలోని దుఃఖాశ్రువులు జాఱకముందే యానందాశ్రువు లందుఁ గలిసిపోయినవి. ఇంతకుఁ గారణమంగుళీయకమని తెల్లమైనది. శకుంతలాదుష్యంతు లానందాయత్తచిత్తులై యొకరినొకరు వెఱ్ఱిగఁ జూచుకొనుచుండిరి. మిక్కుటమైన భావభరముచే నోట మాట రాదఁట. అపుడు కవి "ఈ చింతల్ దెచ్చిన యుంగరము తాఁ జేటూనియున్ దానివృత్తాంతం బామెకుఁ జెప్పఁజాలఁ డతఁ డాతన్వంగియున్ దానివృత్తాంతం బాతని దెల్పఁగనుం జదుగలే దయ్యారె! యయ్యిర్వురకున్ గొంతుల్ సాధ్యముగాక వ్రక్కలకె వాక్కుల్ నేర్పి రొక్కింతగన్" అని యాసన్నివేశము నతిమాత్రమనోహరము గావించినారు.

బాలకృష్ణుఁ డను శీర్షికలో- యశోద మాతృత్వము పొంగారఁ జిన్నికృష్ణుని జేరఁదీసి ముద్దాడుచుఁ జేరువనేయున్న రాధను జూచి "ఓసి రాధ! మేనల్లుని సంబరపడుచు నారయుటే యనుకొంటివేమి! నేఁ జెల్లి కుమార్తె నోర్తు కని యీవలెన్ సుమీ!" అని మేలమాడును. రాధ యులఁతిగ నవ్వుకొని "ఏమి యల్లుఁడ యత్త మత్త యని యందువు వత్తిగ నిందుకోసమా" యనినది. ఇదియొక మనోహరమైన సన్నివేశము. యశోద భావము రాధ యెఱుఁగును. రాధ ప్రత్యుత్తరములోని మర్మము యశోదకుఁ దెలియదు కృష్ణుఁడు రెండును నెఱుఁగును. చదువువారును నాభావద్వితయము నెఱుఁగుదురు. దీనినే యాంగ్లమున డ్రమాటిక్ ఐరనీ (Dramatic irony) యందురు.

"శ్రీ సెట్టి మేస్టరుగారి" రచనలో నిట్టిచమత్కృతు లెన్నియేనిఁ గలవు.



# కుమారసంభవము - పార్వతీ శీలచిత్రణము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము, ఎం. ఏ.,

శీలచిత్రణము విశిష్టమగు కావ్యశిల్పము. ప్రపంచవాఙ్మయములను సమగ్రముగ సమీక్షించిన సారస్వతేయులు త్రివిధములగు శీలచిత్రణవిధానములను నిరూపించిరి. అందు మొదటిది జాతిలక్షణవిధానము, రెండవది ఆదర్శ శీలచిత్రణము, మూఁడవది యథార్థ శీలచిత్రణము. మువ్వురు కవిమూర్ధన్యుల మధురసృష్టులయం దీమూఁడు విధానములు పరాకాష్ఠ నందెను. వారే వ్యాసకాళిదాసషేక్స్పియరులు. ఇందుఁ గాళిదాసు గావించిన యాదర్శ శీలచిత్రణము నవలోకింతము.

కాళిదాసు శైవుఁడు. అతని మతము శైవాద్వైతము. పార్వతీ పరమేశ్వరు లాతని కిష్టదైవతములు. ఈ సృష్టియంతయు తత్స్వరూపమే. ప్రకృతియే పార్వతి. పురుషుఁడే పరమేశ్వరుఁడు. కాళిదాసు తన ప్రథమకావ్యమగు ఋతుసంహారమునఁ బ్రకృతిని వర్ణించెను. అందుఁ బరమేశ్వరీచరణమంజీర నినాదముల నడుగడుగునకు నాలించినాఁడు. ప్రప్రథమమున మానవునకు గోచరించునది ప్రకృతిమాత్రమే. జ్ఞాననేత్రమును విప్పుటకు మొదలుపెట్టినచోఁ బురుషుఁడుగూడఁ గానవచ్చుచుండును. మొదట ప్రకృతియుఁ బురుషుఁడును భిన్నులుగాఁ గానవత్తురు. అట్టివారి కభేదము నెఱింగి యొక్కటిగాఁ గాంచుటయే జ్ఞానమునొక్క పరాకాష్ఠ. కుమారసంభవమున నావిషయమంతయుఁ గవి చక్కఁగా నిరూపించినాఁడు.

పార్వతి పరమేశ్వరుని యర్ధాంగలక్ష్మి యెట్లు కాఁగల్గినదో అట్టి సర్వోత్కృష్టమగు జగన్మాతృస్థానము నధిష్ఠించుట కెట్టి త్యాగనిరతి, అచంచల విశ్వాసము, నిష్ఠాగరిష్ఠతయు నవసరమో ఆ కవికులగురువగు కాళిదాసు పార్వతీ శీలచిత్రణమున మనోజ్ఞముగ నిరూపించెను. ఇట్టి పాత్రల స్వభావోన్మీలనముచే నీకవిసార్వభౌముఁడు భారతీయ ప్రణయ

రహస్యములను గాంతాసమ్మితముగా నుపదేశించి రసలుబ్ధులకు రసామృతము పంచిపెట్టెను.

పరమేశ్వరప్రేరణమున దక్షుఁడు ప్రజాపతి యయ్యెను. ప్రజాసృష్టికిఁ గడంగిన దక్షునకు నఱువది కూఁతు లుదయించిరి. విధివిహితముగా వారందఱిని దగిన భర్తల కొసంగెను. వారికిఁ బుట్టిన సంతానముచేఁ జరాచర మంతయు వ్యాప్తమయ్యెను. ఆకన్యలలో సతి యను కన్య నాతఁడు రుద్రున కొసంగెను. కన్య నొసంగుటచే నతఁడు రుద్రునకు గురుస్థాన మయ్యెను. అందువలన రుద్రునికంటెఁ దా నధికుఁడ ననుభావ మాతని మనసునఁ బొడమెను. దేవతలందఱు రుద్రు నధికునిగాఁ గొనియాడుట యాతని కసూయాకారణ మయ్యెను. అతనిని గించపఱచుటకై దక్షుఁ డొకయాగము చేయఁగడంగెను. దేవతల నందఱిని యాగమున కాహ్వానించెను. పురాణపురుషుఁడైన యల్లునకు మాత్ర మాహ్వానము లేదు. దక్షున కింత యహంకారమా యని పరమేశ్వరుఁడు తలంచెను.

సతి పతివ్రత. భర్త నీగతి తండ్రి యెల్లిద మొనర్చుట యామెకుఁ గష్టముగా నుండెను. "తండ్రికింత యహంకార మేల? పట్టుదల యేల?" యని తలంచి తండ్రి పట్టుదల మాన్ప నమకట్టి "అనాహూతో౽ధ్వరం గచ్ఛే" త్తని పెద్ద లందురు గావునఁ బిలువకున్నను తండ్రి యొనరించు యాగమున కరుగఁదలంచెను. పరమేశ్వరుఁడు వలదని వారించెను. కాని యామె తనపట్టుదల మానలేదు. తండ్రిని బోలినకూఁతురే యని శివుఁడు భావించెను. పిమ్మటఁ దండ్రివలనఁ బరాభవము పొంది తన లోపము నెఱింగి యోగముచే శరీరము వదలి పునర్జన్మమునకై శైలాధినాథునితనయ యయ్యెను.

దక్షుఁ డహంకారి. ఆతని కూఁతురగు సతికిఁగూడ నాదోషము సంక్రమించెను. అహంకారము రజోగుణలక్షణము. శివుఁడు జగత్పిత.

అతని భార్యయగు నీమె జగన్మాత కావలెను. రజస్తమోగుణోపహతి గావించిన సత్వోద్రేకముచేఁగాని యట్టి దుర్లభస్థానము లభింపదు. కావున నామె కింకను నట్టిపరిపూర్ణత సిద్ధింపలేదు. పరిపూర్ణతకై యామె యింకొకజన్మ మెత్తవలసివచ్చెను.

సతీదేవి ధరణీధరేంద్రునితనయగా మరల జన్మించెను. శివుని మహైశ్వర్య మెఱింగి యాతనియెడఁ బూజ్యభావముగలవాఁడే యామె తండ్రి యగుట కర్హుఁడు. హిమవంతుఁ డట్టివాఁడు. శివుని పాదరజము శిరముపైఁ దాల్చుకొనినవాఁడు. నగాధిరాజు. దేవతాత్ముఁడు. ఓషధీశ్వరుఁడు. మహోన్నతుఁడు. అనేకరత్నప్రభవుడు. అట్టిరత్నములలోఁ బార్వతీకుమారీరత్న మగ్రగణ్యము గదా !

శుభప్రదమై స్థావరజంగమరూపము లైనశరీరు లన్నిటికిని బార్వతీజన్మదినము సుఖప్రద మయ్యెను. హిమవంతుఁ డంతకుమున్నే పుత్రవంతుఁడైనను నాతనిప్రాణమంతయుఁ గూఁతుపై నుండెను. ఆమె వలనఁ దాను పవిత్రుఁ డైనట్లు, అలంకృతుఁ డైనట్లు భావించెను. పార్వతి దినదినప్రవర్ధమాన యగుచుండెను.

బాల్యమున నామె మందాకినీసైకతవేదికలందు సఖీసమేతయై క్రీడారసము చూఱఁగొనుచుండెను. ఇట్టి బాల్యవిచేష్టితములందుసైత మామె ధర్మనిరతి వ్యక్తమగుచుండెను. తగినయీడున నామె విద్య నభ్యసింపఁదొడంగెను. శరత్కాలమున గంగానదికి రాయంచ లరుగుదెంచినతెఱంగున, రాత్రియైనంత మహౌషధిని దనకాంతులు చేరువడువున, నుపదేశకాలమునందే పూర్వజన్మవాసనావశమున విద్య లన్నియు నామెకుఁ బ్రాపించినవి.

యౌవనావిర్భావమునఁ బార్వతి సర్వాంగసుందరి యయ్యెను. ఈమె విధాతృని యనిదంపూర్వసృష్టి. సౌందర్యమునంతయు నొక్కచోఁ జూడవలె ననుకౌతుకములో విధాత సర్వోపమాద్రవ్యములఁ దెచ్చి వానిస్థానమున వాని నుంచి ప్రయత్నముతో నామెను సృష్టించినట్లున్నది.

ఇట్లుండ నొకనాఁడు కామచారుఁ డగునారదుఁడు పిత్రుసమీప మందున్న పార్వతిని గాంచి "ప్రేమచే హరునియర్ధాంగమును హరించి యేకపత్ని కాఁగల" దని యాశీర్వదించెను. రిత్తవోవని మునిసత్తముని మాట మదియందుంచి హిమవంతుఁ డామెకొఱకై యెట్టివరాన్వేష ణముఁ గావింపలేదు.

సతీవియోగానంతరము శివుఁడు సర్వసంగపరిత్యాగ మొనర్చి హిమాలయమందే యొకరమ్యప్రదేశమున నేమికోరియో తప మాచ రించుచుండెను. అద్రినాథుఁ డీవిషయ మెఱింగి యయ్యష్టమూర్తిని బూజించి సఖీసమేతయైన తనతనయ నాతనిశుశ్రూష గావింప నాన తిచ్చెను. ఇతరగుణముల నామె యెంతయున్నతయైనను పెద్దలయెడ వినమ్రురాలు. తండ్రియానతి శిరసా వహించి శివుని సేవించుచుండెను.

పార్వతి త్రినేత్రునికన్నుసన్నల మెలంగుచు, శ్రమ యనక పూజాప్రసూనముల సంతరించుచుఁ బరిచర్య గావించుచుండెను. అది రమ్యప్రదేశము. ఉపచరింపఁబడువాఁడు యువకుఁడు. తాను తరుణి. తారుణ్యమపరాధకారి. అట్టియెడ నిష్ఠాలోపము లేక, ధైర్యము చలింప నీక సేవించుట పార్వతినిగ్రహమునకుఁ బ్రబలనిదర్శనము.

ఆసమయమున దేవతలకార్యము దీర్పనెంచి మన్మథుఁడు రతి వసంతులఁ గూడి శివునియాశ్రమమునకు విచ్చేసెను. వసంతవిజృంభణ మారంభ మయ్యెను. వసంతావిర్భావముచే జేతనాచేతనములు కామ పరవశము లాయెను. స్థాణువనౌకస్కులైన తపస్వు లాసమయమున నమిత ప్రయత్నములై మనోవికారముల నణఁచుకొనఁగల్గుచుండిరి. శివుఁడు సమాధిస్థుఁడై యుండెను. దూరమునుండి యీతని దర్శింపఁగనే మన్మథుని చేతినుండి చాపశరములు జారి క్రిందపడెను. అతని హస్తములు సన్నగిల్లెను. శివుని సేవించుటకై వచ్చిన పార్వతినిగాంచి యతని ధైర్యో త్సాహము లించుక మూల్కొనెను. అప్పు డామె నవోదితవసంత

ప్రసూనభూషణాలంకృతయై, కిసలయచ్ఛవి రాజమానయై, నడయాడు లత వలె నొప్పుచు తన చెలికత్తెయలతో శివుని సేవావసరమును బ్రతీక్షించుచుండుట మన్మథుఁడు గాంచినాఁడు.

అది మిక్కిలి పరీక్షాసమయము. మన్మథుని మనోరథ విపర్యాయ మటో యిటో తేలిపోవలయును. అధరీకృతరతిసౌందర్య యగు పార్వతీసౌందర్యమున కేపాటైనఁ జారితార్థ్య మున్నదో లేదో నిర్ణయింపఁబడు క్లిష్టసమయ మది. ఈసమస్యను బ్రతిపాదించుటకే యిట మహాకవి పార్వత్యాగమనము సకోత్కృష్టకవితామాధుర్యములతో వర్ణించెను. త్రిభువనైకసుందరియగు పార్వతీరూపము నాలంబనవిభావమైన, యకాలవసంతావిర్భావముచేఁ గల్గిన యుద్దీపనవిభావమైన యోగనిష్ఠాగరిష్ఠుఁడైన శ్రీకంఠుని నిద్రాణమైయున్న స్థాయిభావమును బ్రబోధింపలేకపోయెను. కేవల బాహ్యసౌందర్యముచేఁ బరమశివుని మానసము రంజిల్ల దనువిషయము స్పష్టమయ్యెను. మన్మథుఁడు మర్యాద మీఱి వర్తించెను. తనయంతరము నెఱియంతరము నావంతయుఁ దెలియక శివునిపై సమ్మోహనాస్త్రము ప్రయోగించెను. శివుఁడు చంద్రోదయారంభమున నంబురాశివలె ధైర్యము సన్నగిల్లఁ బార్వతీ బింబోష్ఠముపై మక్కువతోఁ జూపుల మఱలించెను. పార్వతి సిగ్గు దొంతరలు తొనకాడ మొగ మావలికిఁ ద్రిప్పి తనభావమును వ్యక్తమొనర్చెను. శివుఁడు తనభావవికార మెఱింగి వెనుకకుఁ దిరిగి మన్మథునిదుశ్చేష్టితమును గాంచి కోపముతో నాతని భస్మావశేషుని గావించెను. ఇఁక స్త్రీసాహచర్యమును బరిహరింపఁదలఁచి యతఁ డంతర్హితుఁడయ్యెను.

అట్టిస్థితిలోఁ బార్వతి యేమనలేదు. మూర్ఛ మునుంగనులేదు. కొంతవడి నిర్ఘాంతపోయి తెప్పరిల్లి తండ్రికోరిక వ్యర్థమైన దనియుఁ, దన సౌందర్యము డింపువడె ననియుఁ, జెలికత్తియల యెదుటఁ జిన్నతనమాయె ననియు సిగ్గుతో నింటికిఁ బోయెను.

పార్వతి సిగ్గుపడెను. ఎందువలన? శివుఁడు తన్నవమానించెనని కాదు. తనసౌందర్యముచే శివుని స్వాధీన మొనరించుకొనఁదలంచినది. అది వ్యర్థమయ్యెను. ఎట్లయినను శివుని బరిగ్రహించితీరవలెనని యామె యభినివేశ మూనెను. దురభినివేశము దూరమునం దుంచఁదగినదే కాని సదభినివేశము సర్వజనసంసేవ్యమే. దుష్కరకార్యము సాధించుట కభినివేశ మావశ్యకము. శివుని బరిగ్రహించుట యిప్పుడు దుష్కరకార్యము. స్త్రీసన్నిధానము తపస్సున కంతరాయ మని తలఁచి యేదో నిర్జనస్థలమున కాతఁడు లేచిపోయినాఁడు. అతని వశ మొనర్చుకొనుట యెట్లు? అట్టి దుష్కరకార్యమును సాధించుటకుఁ దపశ్చరణ మొక్కటే శరణ్యము. "యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం, యచ్చదుస్తరం, తత్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్", అనికదా పెద్దలన్నారు. కవియు "అవాప్యతే వా కథ మన్యథా ద్వయం తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః" అని తపఃప్రభావము నుగ్గడించినాఁడు. కావునఁ బార్వతి తపస్సుచేయ సంకల్పించెను. ఆమెహృదయము వజ్రసదృశము. ఆమెశరీర మెంతమృదువో యామెహృదయ మంతకఠినము. "వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి".

పార్వతి తనహృదయమును దల్లి కెఱింగించెను. వలదని యామె యెంతయో వారించెను. ఈప్సితార్థస్థిరనిశ్చయమైన మనస్సును బల్లమునకుఁ బాఱు నీటిని నెవఁడాఁపఁగలఁడు! మమకారముచే వారించు తల్లిమాట యామె పాటించలేదు. సఖీముఖముననే తన నిశ్చయమును దండ్రి కెఱింగించి యనుజ్ఞ కోరఁగా నతఁడామెయభినివేశమునకు మెచ్చి యనుజ్ఞ నొసంగెను.

ఒకయుత్తుంగశృంగమునఁ బార్వతి తన తపోవనమును నిర్మించుకొన్నది. ముక్తాహారములఁ దీసి రుద్రాక్షమాలికలను బూనెను.

మెత్తని పట్టువస్త్రముల మాని కఱకువల్కలములఁ గట్టుకొనెను. కందుక కేళి వదలి యామెహస్తములు కుశాంకురాదానపరిక్షతము లయ్యెను. కేశములు జడలు కట్టెను. కటిక నేలఁ బరుండెను. పుత్రవాత్సల్యముతో వృక్షకములకుఁ బయస్సు లొసంగెను. ఇట్లు ప్రకృతితో నభిన్నత్వ మందెను. ఇప్పు డామె కాంక్షించుచున్నది పురుషునితో నభిన్నత్వము. పార్వతి యనన్యతిపాదీక్షాపరతంత్రత ధర్మవృద్ధులగు యతీశ్వరులను గూడ దిదృక్షారతులఁ గావించెను.

పార్వతి కీతపశ్చర్య పరితృప్తి నొసంగలేదు. శరీరమార్దవమును బరిగణనసేయక కఠోరనియమములఁ బాలింపఁదలంచెను. గ్రీష్మమునఁ బంచాగ్నిమధ్యమునవుండి శుచిస్మితయై జప మొనర్చెను. వర్షాసమయ మున నారుబయట జోరునఁగొట్టు వాన గాలి కగ్గమై కటికఱాలపైఁ బరుండినది. హేమంతమునఁ గుత్తుకబంటినీటిలో నొంటియై నిలిచినది. పర్ణవృత్తిత్వము తపస్సునకుఁ బరాకాష్ఠ. పార్వతి దానినిగూడఁ బరి త్యజించి యపర్ణ యయ్యెను. మృణాళికాపేలవమైన శరీరముతో దృఢ కాయులైన తాపసుల తపస్సులనుగూడఁ నిస్సార మొనర్చెను. ఆమె కిప్పుడు యౌవనమత్తత యంతరించెను. హావభావలీలాచాపల్యము రూపుమాసెను. రజస్తమము లడుగంటి సత్వ ముద్రిక్త మయ్యెను. ఆమె సత్ప్రభావముచే నాశ్రమమునందలి విరోధిసత్వములుగూడ మైత్రి పాటించుచుండెను. ఉమాదేవి తపోమహిమ నలుదిశల నలముకొనెను. పరమశివునకుఁగూడ మెచ్చువచ్చెను. అతని కప్పుడు సతి స్మృతిపథ మున నిల్చెను. తనకుఁ దోడునీడగానున్న సతి యామెయై యున్నది. కావున నీమె నగ్నిపరీక్ష గావించికాని పరిగ్రహింపరాదని తలంచెను.

ఇంతవఱకుఁ గవి ప్రత్యక్షపద్ధతిలోనే పార్వతిపాత్రను బోషించెను. ఇఁకఁ బరోక్షపద్ధతిచే నత్యంతరమణీయమగు ధ్వనిమార్గమునఁ, బార్వతి శీలగౌరవాధిక్యములను, మహాదేవునికై యామె పొందిన మనోవేదన

లను, నామె కఠోరనియమపాలనమును దెలియఁజేసెను. ఈ ఘట్టము కవిసార్వభౌముని నాటకీయప్రతిభకు నాందీప్రస్తావన మనదగును. ఇందలి ప్రతి శబ్దము, ప్రతి సమాసము, కవియంతరంగమున మథింపఁబడి చక్కని చిక్కని యమృతరసము నొలుకుచున్నది. ఇందు శబ్దమునకుఁ గల వాచకవ్యంజకశక్తి చరితార్థమైనది. వ్యాజస్తుతి, వక్రోక్తు లిందు సార్థకములైనవి. ఔచిత్యపోషణమున కీఘట్టము నికషోపలము.

ఉమాదేవి యిప్పుడు సమదర్శనముగల పండితురాలు. ఆమె కడకు 'అజినాషాఢధరుఁడు' 'ప్రగల్భవాగ్విలాసుఁడు' రూపుఁగొన్న బ్రహ్మచర్యమా యనిపించునట్లు శివుఁడు వటురూపమునఁ బ్రత్యక్షమయ్యెను. వచ్చినవటువు పార్వతి యొసంగినసపర్యల స్వీకరించి యించుక విశ్రమించినట్లు నటించి యామెతో సంభాషణమునకుఁ గడంగెను. ముందు కుశలప్రశ్నల నొసరించెను. పిమ్మట నామె తపోమహిమ నుగ్గడించెను. ఇట్లామె నభిముఖురాలిఁ గావించి మెల్లఁగా నామె యొనరించు నుగ్రతపములకుఁ గారణ మడిగెను. ఆమె బదులు చెప్పుటకు సిగ్గుపడి చెంతనున్న తన చెలికత్తెకుఁ జెప్పుమని సన్నయొనర్చెను. చెలికత్తెయు నామె పరమశివుని బలిగా నభిలషించుచున్న దనియుఁ, దద్విరహవ్యథచే వాడివత్తలైన దనియు, నాతని బడయుట కుపాయాంతరము గానక తపమ్మునకుఁ గడంగె ననియు, నామె తనయాశ్రమములో నాటిన చెట్లు ఫలవంతములైనవి కాని యామె మనోరథమమాత్రము ఫలవంతము కాలేదనియుఁ జెప్పెను. ఆమాట విని వటువు చాల సంతసించియుఁ బైకి పొంగక పార్వతినైపు మఱలి "యామె చెప్పినమాట నిజమా! పరిహాసమా!" యని తన భావివిమర్శకు బీజావాప మొనర్చెను. పార్వతియు సిగ్గునై పలుకలేక మితముగా "నయ్యా! ఆమె చెప్పినది నిజమే. నేను సర్వోచ్ఛస్థానము నభిలషించితిని. దానికోసమే యీ తపస్సు. కోరికలకుఁ గొఱ లేనిది లేదుకదా" యని పలికెను.

అంత వటు విట్లుపలికెను— "తపోధనురాలా! నేను మహేశ్వరుని బాగుగా నెఱుంగుదును. అంత యమంగళాభ్యాసరతుని జూడఁబోము. అతని వరించి యపకర్షకు, నవమానమునకు, నవహేళనమునకు, ననుచితత్వమునకుఁ దావలమైతివి. అతని రూపోత్కర్షత విరూపాక్షత్వము నిరూపించును. అతని భాగ్యము దిగంబరత్వముచే వెల్లడి యగుచున్నది. అతని జన్మవృత్తాంత మెవ్వరికిని దెలియదు. కావున వరునియందుఁ గోరఁదగు గుణ మొక్కటియు నాతనియందుఁ గానరాదు". ఇట్లు పార్వతిమనస్సు పరీక్షింపఁదలఁచి వటుఁడు శివదూషణ మాచరించెను. చాపల్యసర్పము నాహరించుట కీదూషణము కిరాతగానము. పార్వతి హృదయమునందలి చాపల్యపంకమును దపఃకతక మిదివఱకే హరించినది. శివదూషణ మామెకు దుస్సహమయ్యెను.

ఆనాఁడు శివదూషణమును దన జనకునిముఖతః వినినపుడే సహింపలేక, దేహపరిత్యాగముఁ గావించిన సతీదేవియగు పార్వతి, యపరిచితుఁడగు నీయువకుని నిందోక్తుల నాలింపఁగలదా? ఆ యప్రియాలాపముల కామె యధర మదరఁజొచ్చెను. నేత్రాంచలములు కెంపు వహించెను. సుభ్రువు భ్రుకుటివికట మయ్యెను. "అలోక సామాన్య మచింత్య హేతుకం ద్విషన్తి మందాశ్చరితం మహాత్మనామ్" "మూఢులు అలోకసామాన్యమైన మహాత్ములచరితమందలి యాథార్థ్యము నెఱుఁగఁజాలక వారలను నిందసేయుచుందురు" అని ప్రపంచమందలి యారీతి వారినందఱిని శాశ్వతముగ మందలించిన దాతపస్వి. బ్రహ్మచారినిందోక్తుల నన్నియుఁ దననిశితోక్తులతో నిరాఘాటముగ ఖండించినది. లోకాతీతమహిమాస్పదునకు, సంపదలెట్టివో! భూషణములెట్టివో! వాహనము లెట్టివో గ్రహించుటకుఁగూడఁ గొంతసంస్కార ముండవలయును. శివుఁ డమంగళాభ్యాసరతుఁడఁట!! విపత్ప్రతీకారపరులకు భూతిసముత్సుకలకు మంగళామంగళవిచారణము కాని సకలజగచ్ఛరణ్యుఁడు, నిరా

శిషుఁడు, ఆశోపహతాత్మవృత్తియునైన శివున కీనింద చెల్లదు. దిగంబరుఁడయ్యు సంపత్ప్రభవుఁడు శ్మశానవాసియయ్యును త్రిలోకనాథుఁడు; భీమరూపుఁడయ్యు శివుఁడగు నాతని యాథార్థ్య మెవ్వరెఱుంగుదురు? విభూషణోద్భాసి కానిమ్ము సర్పధారి కానిమ్ము; గజాజినాలంబి కానిమ్ము, దుకూలధారి కానిమ్ము; కపాలధారి కానిమ్ము, ఇందుశేఖరుఁడు కానిమ్ము; విశ్వమూర్తి శరీర మిట్టిదని యెవ్వఁడు చెప్పఁగలఁడు? నృత్యాంతమున నాతని యొడలినుండి రాలిన చితాభస్మమునకై దేవతలు తోసులాడుదురు. ఇట్లు తనయనన్య శివభక్తిని ప్రదర్శించినది. "విచిత్రరూపాః ఖలు చిత్తవృత్తయః" అన్నట్లు ఎవరివిశ్వాసము వారిది. తనవిశ్వాసమునకు భిన్నమని మరియొకరి విశ్వాసమును మాన్పఁజూచుట సందర్భముగాదని తలంచిగాని "మార్గం ఛందాను రోధేన" న్యాయమును దలంచిగాని "చాలు వివాదములు!! నీవు విన్నట్లే యగుఁగాక!! శివభావైకరసపరిప్లావితమైన నామనస్సు అటేసియుండే స్థిరమైనది. ప్రేమప్రకోపితమగు చర్యలు నిషేధమును గణింపవు" అని పలికెను. ఏటు యీరాచకీవితోఁగూడిన హెచ్చరిక. ఈ హెచ్చరిక యొక్క బ్రహ్మచారికే కాదు. భగవద్విశ్వాసమునుగూర్చి నిందించు వారికందఱకు ననువర్తించునది. భగవద్విశ్వాసము అనుభవైకవేద్యము. వాదప్రతివాదములతోను, తర్కవితర్కములతోడను కుదురునదికాదు. పార్వతి భగవద్భక్తిసామ్రాజ్యమున కధిరాజ్ఞియైనది. ఆమె విశ్వాసమమోఘమైనది. అచంచలమైనది. ఎట్టి వాదప్రతివాదము లామెస్థానమునుండి చలింపఁజేయవు.

వటుఁడింకేమియో మాటలాడ యత్నించినట్లు దేవి గుర్తించినది. ఆతని యధర మొకింత చలించినది. ఇతఃపూర్వమే వ్యర్థమగు వాదమున కవకాశము కల్పించి, తన మనోనాథుని నిందింపగా నాలింప వలసివచ్చినందులకే యామె పశ్చాత్తప్తయైనది. మరల నట్టియవకాశ మీయరాదని నిశ్చయించుకొని "ఓ చెలీ! స్ఫురితోత్తరాధరుఁడై యీ వటువు మరల మాటలాడ నుంకించుచున్నాఁడు. ఇతనిని వారింపుము!!

మహాత్ములను నిందించువారికే కాదు! వారి నిందావాక్యముల నా
నాలించువారికికూడ మహాపాతక మంటుకొను" నని పల్కియు తన
మాటను విమర్శించుకొని రాజసమును వారించి సత్యస్ఫూర్తి నెగడు
నట్లు తానె యచ్చోటు వీడ ముందు నడుగిడినది. ఈమాటలకు ప్రచ్ఛ
న్నరూపమునందున్న పరమశివుఁడు పరితోషమందినాఁడు. ఇంకను
నామెను పరీక్షించుట కాదరియాళుని హృదయ మంగీకరించలేదు.
భక్తుల నంతకఠినముగఁ బరీక్షించుస్వభావ మాతనిది కాదు. పార్వతి
యాకాంక్షించిన పదవి మహోన్నతమైనది. అందుచేతనే అంతమాత్ర
ముగనైనఁ గావింపవలసివచ్చినది. సంతుష్టహృదయుఁడై పరమేశ్వరుడు,
వృషకేతనుఁడై, స్వస్వరూపమునంది, స్మితాననుఁడై పార్వతి పాణి
గ్రహణము గావించెను. శైలాధిరాజతనయ సరభాంగయష్టి చలించి
నది. ఎత్తినపాద మెత్తినట్లేయుండ మెట్టునెవ్వను మూపఁజాలక నిలఁ
బడిపోయినది. అచట నిలువజాలక సిగ్గుపడినది. ఈస్థితినంతయు
"మార్గాచల వ్యతికరాకులి తేవ సింధుః" అని చిత్రించుట కాళిదాసు
కవి శిల్పము ననల్పముగా వ్యక్తము చేయుచున్నది.

అచలముచే నడ్డగింపఁబడిన మహాప్రవాహమువలెనున్న దామె.
ఇట్టి యవస్థయందున్న నాముగ్ధతో పరమేశ్వరుఁడు ముద్దుముద్దుగా నిట్లు
ముచ్చటించెను. "ఓ యవనతాంగీ! నీతపస్సుచే నీకు నే నమ్ముడు
పోయితిని. నేఁటినుండి నేను నీదాసుడను." పార్వతి తపస్సు ఫలించి
నది. తక్షణమే కఠోరనియమ సంజనితక్లేశమంతయు నాళాక దృశ్య
మైనది. "క్లేశః ఫలేవ హి పునర్నవతాం విధత్తే"

పరమేశ్వరుఁ డింత హృదయంగమముగా మాటలాడినను గౌరి
యొక్క మాటైన బదులాడలేదు. తనసఖిచే విశ్వాత్మకుఁ డగు శివున
కిట్లు సందేశమంపినది. "భూభృన్నాథుఁడే నన్ను దానము చేయుగల
వాఁడుగా నంగీకరించునది".

కాళిదాస మహాకవి ఈసందర్భమున భారతీయ ప్రణయరహస్య
మును కాంతాసమ్మితముగా ధ్వనింపజేసినాఁడు. భారతదేశమున

గాంధర్వవివాహమునకు గౌరవము తక్కువ. అందు ప్రేమోద్ధృతత్వము, యౌవనచాంచల్య మధికము. పార్వతి యాస్థాయి నతిక్రమించి పరమ పవిత్రత ప్రణయపీఠమున సుప్రతిష్ఠితమైనది. అందుచేతనే యామె సర్వోత్కృష్టము సంసారోపేతమునగు బ్రాహ్మవివాహవిధానము నే యాశ్రయించి పరమేశ్వరున కట్టి సందేశమంపినది.

పార్వతిసౌందర్యము లోకాతీతము. అట్టి సౌందర్యము కలదని చెప్పుటకే కవి కావ్యారంభమున నామె సౌందర్యము నంతగా వర్ణించి నాఁడు. ఆ నట్టిసౌందర్యవతినని పార్వతికిఁగూడఁ దెలియును. యౌవన విలాసహంకారమునకుఁ గరావలంబన మొసంగినది. ఈస్థితిలో నామె శివుని వశీకృతుని గావించుకొనుటకై సన్నాహ మొనర్చినది.

అహంకారము రజోగుణలక్షణము. రజోగుణ మడంగినఁ గాని సత్త్వోద్రేకమున కవకాశము లేదు. సత్త్వోద్రేకమునఁ గాని శివవశీకరణము సాధ్యముకాదు. ఈవిధముగా నామెకు సాధనసంశుద్ధి లేదు. ముందుగా సౌందర్యాహంకార మడంగవలయును. అప్పు డామెయందలి రజోగుణ మడంగును. పిమ్మట తపమ్మొనరించినచో సత్త్వ ముద్రేకించును. అప్పు డామె తనకుఁ బతిగ్రహణయోగ్య యగునని యెంచి యౌవనాహంకారకారకుఁడగు మన్మథుని భస్మమొనర్చి శివుఁ డంతర్హితుఁ డయ్యెను.

మన్మథ నిర్మథనముతోఁ బార్వతి యౌవనాహంకార మంతరించెను. శివుఁ డనూపహార్యుఁ డనియు, అతని సాధించుటకుఁ దన సుందరమైన శరీరము నిరర్థక మనియు సమర్థించుకొన్నది. దుర్లభుఁడైన శివుని సమాగమమునకు మార్గాంతరము గానక తపోదీక్ష వహించినది. ముందు సర్వసమత్వము నలవఱచుకొన్నది. వృక్షలతాదులందు, కురంగశాబకములందు వాత్సల్యము నెఱపినది. శీతోష్ణాది ద్వంద్వములందు సమభావమును సాధించినది. ఈవిధముగా బరమేశ్వరి ప్రకృతితో నభేదము నొందినది. ఇఁకఁ బురుషునితో నొందవలసియున్నది. నిత్యాభియుక్తురాలై యనన్యచిత్తముతో నాతని నుపాసించినది.

కొండమీఁదినుండి దిగివచ్చినాఁ డాతఁడు. వచ్చి "అవనతాంగి! నీతపముల కమ్ముడువోతిని. నీకు దాసుఁడన నన్నేలుకొ" మ్మని వేడుకొనెను.

ఈవిషయమున రతికిఁ బార్వతికిని విశేషాంతరము గలదు. సౌందర్యము తప్ప నిరువురకు నెందును సామ్యము లేదు. పార్వతికిఁ గల గుణౌన్నత్యము గాని యాత్మార్పణముగాని రతికిఁ గానరావు. సౌందర్యాభిమానియగు కాముఁ డామెకు భర్తయయ్యెను. అతనితోఁ గలిసి యిష్టసుఖముల నొందుటచేఁ గృతకృత్యురాలైన ట్లామె భావించెను. మన్మథుఁ డవివేకి. ఎదిరిని తన్నుం దెలియు వివేక మాతనికి లేదు. శివునిపైఁ జెలరేఁగి రూపుబాసెను. కన్ను మూసి కన్ను దెఱచునంతలో నింతపని జరిగెను. రతిదేవి దుర్భరమైన దుఃఖములో మునిఁగిపోయెను. సుఖమునకైనను దుఃఖమునకైనను నామెకుఁబట్ట శక్యముగాదు. ఆమె భోగవినాశమును గూర్చియే విలపించెను గాని యాత్మార్పణమొనర్చి కొనిన ప్రణయనాశనమునుగూర్చి కాదు. దుఃఖసమయమున ధైర్యమన నెట్టిదో యెఱుఁగని దుర్బలహృదయ యామె. భర్త జీవితమునుగూర్చి తాను నిరాశురాలైనప్పుడు ప్రాణపరిత్యాగమునకే సమకట్టెను. ఇది సామాన్యమానవలక్షణము. పార్వతి యాదర్శసతీమణి. కష్టములలో నామె ధైర్యము బురుషులకుఁగూడ లేదు. "పార్వతి సౌందర్యము ప్రణయమునందును, ప్రణయము పరిణయమందును పరిణయము కుమార ప్రభవము నందును సార్థకత నొందెను. శివుని వశీకృతుని గావించుకొనుటతో నామె ప్రేమ తనవిసవలేదు. అతని మెప్పించి శరీరార్థము నాచికొన్నఁగాని కృతకృత్యత భావింపలేదు. జగత్పితకు భార్యయై జగన్మాతృ గౌరవము నందుకొన్నది.

పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరౌ
ప్రపంచ మాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః॥



# మహాశ్వేత

రచన: శ్రీ బి. భాస్కరరావు, బి. ఏ. (ఆనర్సు)

అంతిపురమ్ములోపల – నిరంతర మంతరమందు మానిభా
స్వంతునిఁ బుండరీకుని జప మ్మొనరించుచుఁ బారిజాతవృ
క్షాంతము భావలోకమునఁ దారటులాడఁగ నక్షమాల నే
కాంతమునందు నెవ్వరును గన్గొనకుండ ధరించు శ్వేతయున్.

చింతన సేయు సంతతము ; చేరక నేరిని జేరనీదు ; వి
శ్రాంతివిహీనచిత్తమున పారెకు నారెకు నిశ్వసించు ; సం
భ్రాంతమనస్సులో సరసువంకఁ గనుంగొను, మూర్ఛనొందు, సం
తంతఁ దనంతఁ దేఁకొను నారట మూరట యొక్కటీ రసన్.

పిలిచినఁగాని పల్కదొక వేళ ; నొకప్పుడు పిల్చినట్లుగాఁ
బలుకును బిల్వకున్నను ; దపస్వినిలాగున సంచరించు ; ను
జ్జ్వల మగు వేష మూనఁ ; బరిచారికలం గని చేరఁ బిల్చి యా
వలి కరుగం దలంచు ; సముపాయము గానక మాను వెంటనే.

అంతట నొక్కనాఁడు కుసుమావలి లోపలఁ బ్రాణ మేమొ యు
న్నంతటి జాగరూకత, రహస్యము నొప్పఁగ దాఁచి తెచ్చి "నీ
శ్చింతగ నుండు మమ్మ ! యిదె చెల్వని యుత్తర" మంచు దాసి పూ
బంతికి వంతుగాఁ బ్రణయపత్రము నిచ్చెను శ్వేత చేతికిన్.

ఆమె ప్రియాక్షరాంకిత మహార్థమునే మనన మ్మొనర్చెనో ?
కామితపూర్తికిం దగిన కాలముగా నభిలాష పేర్చెనో !
ఏమొ ! ప్రభాసనాంగుళుల నించుక యించుక తాఁకి మెత్తఁగా
సామి మొగిడ్చెఁ గన్గవను సాంధ్య సరోజ యుగమ్ము సాటిగా.

ప్రియుఁడు లేఖయై సాక్షాత్కరించి నట్లు
లేఖలో నుండి తన్ను లాలించి నట్లు

తలిరుఁజేతులం దాఁకి ముద్దాడినట్లు
తలఁచెనో యేమొ! నిలువెల్లఁ బులకలొత్తె.

ఏతాదృశ మగుస్థితిఁ గని
చేతోహర మగువిధానఁ జేటిక తెలిపెన్
శ్వేతకు లేఖావిషయము
నీ తీరున మాటవెంట నెడఁదయుఁ బలుకన్.

"అనుదిన మేఁగురీతి నుదయమ్మున మేల్కొని పూలసెజ్జతో
వనమున కేఁగితిన్; కుసుమవారము హారములోనికిం దగం
గనుఁగొని కోసితిన్; నిజముగా దరి నాదర మొప్ప నొప్పు నా
మునివరుఁ జూడనైతిని సముత్థితుఁడై ననుఁ జేరు నంతకున్.

అతఁడు నాసవిధాపమున నాఁగి, దిశ ల్పరికించి, కించి దా
ఘూత శిరస్కుఁడైనటులు ఘర్మజలమ్ములు గ్రమ్ముచుండ, సం
గాతము పీడినందులకొ కంపము నొందుచు, సంకుచించుచున్
గాతరుఁడై కనంబడియెఁ గన్నుల మిన్నక చూచుచున్ననున్.

అప్పుడు గుర్తిపట్టి యనురా! యితఁ డాతఁడె యౌనె యంచుఁ, గాల్
చప్పుడు నేని పోల్చుకొనఁ జాలకపోయితి నెట్లొ యంచు, నా
తప్పు గ్రహించి తత్క్షణమ తత్పదపద్మములందు వ్రాలి నైఁ
గప్పిన కప్పుఁ బాపుకొనఁ గాంక్ష యొనర్చితిఁగాని, యంతలో.

దైన్యము దొప్పదోఁగు కనుదమ్ముల ముమ్మరమైన బాధ సా
మాన్యుని పోలెనై యతఁడు మన్నన చేయుచుఁ బల్కెఁ దావకా
నోన్యతఁ గూర్చి, దుస్సహ వియోగముఁ గూర్చియుఁ గాని నాఁటి నై
తవ్యము మాటవాసి సయితమ్ము కనంబడ దేమి చెప్పుదున్!

ఈ లేఖను నీ కిమ్మని
వాలాయము నన్ను వేఁడ వాదాడక నే

నా తెమ్మని యిటు నీకను
కూలముగాఁ దెచ్చియుంటిఁ గొదవలు దొలఁగన్.

ఇటుపై నీ యిష్టము ; నీ
వెటు చేసినఁ జేయవచ్చు ; నెద తెలిసెఁగదా !
నిటలమ్మున దిద్దుకొనెదొ !
కటువుగ వద్దనెదొ ! మీఁదఁ గాముఁడె యెఱుఁగున్."

అన విని మోర్పు నేర్పఱఁగనట్టి యమాయిక పోలె శ్వేత క
న్నోనలఁ గవోష్ణ బాష్పములఁ గ్రొత్త తళ తళ హొత్త "బాగు ! నీ
జననము ధన్యమయ్యెఁ ; గనుజంటకు నేఁటికి ధన్యమయ్యెఁ ; జ
క్కని సుఖమూను మారసముఁ గాంచితి వొంటికి రెండు మాట్లుగా.

ఏమనెనే ! ననుం గుఱిచి యేమనెనే ! పలుకైనఁ జెప్పవే !
నా మదిలోని రాచిలుక, నా హృదయాలయు దైవమూర్తి నా
ప్రేమ నెఱింగెనా ! కడల విచ్చిన యామనిగుండె కోకిల
స్వామి గ్రహించెనా ? బదులుపల్కవె !" యంచు దురంతచింతతో.
"మనమున నెంతె యున్నను ప్రమాదమునే తలపోసి పోసి వె
న్వెనుకకు జంకుచుంటి ; దురపిల్లుచు నుంటి విరాళిలోన ; ద
ర్శన మపురూపమై బ్రతుకు సర్వము దుర్భర మయ్యె ; నేమగా
మునుకొని పోఁగజాలను ; విముక్తి లభింపదు పో ! పొలంతికిన్."

అనుచు నాశా విరాళల యంతరమున
నాగు ననురాగవాహిని నాఁగుకొనుచుఁ
జెలుని మచ్చిక ముచ్చటల్ దెలిసికొనుచుఁ
గొసరి యడుగుచు దినమెల్ల మసలె శ్వేత.

ఇనుని మనస్సులోన జనియించిన రాగము నాల్గు దిక్కులం
దున నెదురెక్కి చిక్కనల దుర్భరమై యినునే గ్రసించి వే

సినది; సరోజగర్భమునఁ జిక్కిన తుమ్మెదకన్న కన్నమూ
సినది వ్యర్థార్తయై; యిరులఁ జేద్పడి జంటను బాసె జక్కవల్.

అట్టి యవసరమ్మున వేత్రహస్తుఁ డొకఁడు
త్రోవ చూపి కపింజలుఁ దోడు దెచ్చె;
ప్రీతిమై గౌరవముచేసి శ్వేత మునికు
మారుఁ దన్మిత్రు శుభ సమాచార మడుగ.

దెసలు పరికించి కొంత సందియము పడుచు
నతఁడు మౌన మూనుట గాంచి యామె కాపు
పెట్టినది చేటిని గవాట వీథియందు;
భయము విడనాడి యతఁడి ట్లుపక్రమించె —

"ఏమి వచియింతు నెట్లు నమ్మింతు నేను!
రాజసుత నీవు జడదారి రాయఁ డతఁడు;
దినదినమ్ము వాని యవస్థ దీన దీన
మౌచు హృదయ విదారక మ్మౌచు నుండె.

నిన్ను జూచినది మొదలు నేఁటి దాఁకఁ
బ్రకృతికి విరుద్ధమైన యీ ప్రణయవాంఛ
వార్థియై పొంగి పొంగి దుర్వారమయ్యె;
కడకు ముంచివేయునో యేమొ కరుణశాలి!

నన్ను విడనాడి యొక్కక్షణమ్ము కూడ
నొండు చోటున నెప్పుడు నుండలేదు;
కాని, యిప్పుడు తప్పించి కాని యెదుట
నిల్వఁడు — చిరాత్తమైత్రి మన్నించి యేని.

నీవు వచ్చిన వెంట నీ త్రోవఁ బట్టి
వచ్చి, యచ్ఛోద కాసారవల్లికా వి

కుంజముల బాహ్యసంస్మృతి గోలుపోయి
పిచ్చివాఁడుగా నాకుఁ గాన్పించినాఁడు.

పంచశరతప్త మానస పాత్రలోని
ప్రణయనీరమ్ము నిశ్శ్వాసవాయువై బ
యల్వెడలి కంటికొలఁకుల చల్వ తగిల
సుళ్ళుగొని జాలువారెఁ జెక్కుళ్ళపైని.

అధికతప్తమై శైతల్యవిధురమైన
మదికి నాశ్వాసమును గూర్చుమాడ్కి నతఁడు
దక్షిణకరాన నీకు ముత్యాలమాల
చిత్తమున మెల్లమెల్లఁగాఁ జేర్చినాఁడు.

కనులు గానవు; వీనులు వినవు; నాల్క
పల్క దేదియో మాయ పైఁబడినరీతి;
అంధ బధిర మూక గుణసంబంధ మిట్లు
లేక కాలాన నెనయుట యెంతబాధ!

చిత్తవృత్తి పరాధీన శిథిలమగుట
నెదుట నున్నట్టివానినే యెఱుఁగనట్టి
శూన్యదృక్కులతో నన్నుఁ జూచినాఁడు;
మదనునకు లొంగి కడమెట్టు మెట్టినాఁడు.

'ప్రణయ మీరీతి విపరీతఫలము నొసఁగు
నే' యని యనేకగతులఁ జింతించి యంత,
మనసు నీనుండి మళ్ళింతమనుచుఁ దలఁచి
వాని దరిఁ జేరి తగినట్లు పలుకరింప.

'అన్నియు నెఱింగి యిపుడు నన్నడుగుటేల?
అప్సరఃకన్య నాస్వాంత మాఁచుకొనిదె;

అట్టిసోయగ మీజగమందుఁ గలదె?
ఆమె లేకున్న నాజీవ మంతరించు.

అని పలికి పుండరీకుఁ డాయాసపడుచు
పర్ణమీలితనేత్రాల నవని గనియె;
నంత నా యుపదేశ వైయర్థ్య మెంచి
ప్రస్తుతము ప్రాణముల్ నిల్పవలయు నంచు.
శీతలోపచారక్రియల్ చేసి, కాంక
తగ్గి నెమ్మదించిన యనంతరము, నేను
దొంగనై పుండరీకుఁ డెఱుంగకుండ
నిటకు వచ్చితి వారించు నీవు! యనుచు.

ఇంక నీయిష్టమును మాయదృష్టమమ్మ!
యని కపింజలుఁడు ముగింప నమృతజలధి
మునిఁగి తేలె మహాశ్వేత; ముత్తియముల
పగిదిఁ గనుల సంతోషబాష్పములు కురిసె.

ఇంతలోఁ బరిచారిక యేఁగుదెంచి
"అమ్మ! అమ్మ నీయారోగ్య మరయఁగోరి
వచ్చుచున్నా" రనుచు నొక వార్త దెలుప
శ్వేత సెలవొంది యేఁగెఁ గపింజలుండు.

మాతృవాత్సల్య మొకట, స్వమాక్షి విభవ
మొకటఁ బార్శ్వముల్ గొలిచి యిచ్చకములాడ
గౌరి యేతెంచి బాధానివారకముగ
మధుర యోగ్యవాక్కులఁ బరామర్శచేసె.

తల్లి వచ్చుట పోవుట లెక్కసేయుఁగ
దానిమమ జరిగిన విసుమంత కూడ

శ్వేత మానసెల్లఁ గొల్లవోఁ జేసె మరుఁడు
కరుడుగట్టిన గట్టి తస్కరునివోలె.

చీఁకటి చిమ్మ రేగినది ; చిత్తము నుత్తలపెట్టు సంశయా
నీకము పిక్కటిల్లినది ; నిశ్చితపద్ధతి కానరాదు ; బా
ధాకమనీయమైన వసుధాసతి చంద్రిక మేల్మునుంగులో
నేకత మాదరించినది యేకతమో యభిసారికాగతిన్.

శీతలచంద్రపాదములు శీతసుగంధిల మందవాయువుల్
శ్వేతశరీరవల్లరికి వెచ్చని వై పనిచేసె ; లోకవి
ఖ్యాతమె వేడివేడి గొనినంతటఁ జల్లన మాల ; నేఁటి కీ
రీతిగఁ జల్ల చల్లన ధరించి మఱింతగ వెచ్చనయ్యెఁ బో.

నిద్దపు ముద్దరాలు తరుణీ వరణీయ మనోజమార్గమం
దద్దము రేయి యిల్వెడలి యంతమెఱుంగని దీర్ఘయాత్రలో
సద్దొనరింపకుండఁ బలుసాకులు యత్నము సేసి, గుండెపైఁ
బెద్దతనమ్ము లేక దురపిల్లుట కన్గొని జాలి యామెతో—

“అమ్మా ! యాలస్యము వల
దమ్మా ! నీవిట్టులుండి యాయన యట్లై
మమ్మేమి సేయ నెంచితి
రమ్మకు నాన్నకు నీఁ కేమి యాలంబనమా ?

మరియాదలు గిరియాదలు
తరువాతనె ; నేఁటిరాత్రి దాటిన యూపై
సరిచూడవచ్చు ; నీవు డీఁక
వ నాభిసరణోద్యమమె యవశ్యము నీకున్.

ఈ చంద్రుని దేమి గుణమొ ?
నీచాయల నిల్వలేక నిన్నన్ మొన్నన్

నీచరణము లంటెనె సఖ
రోచిస్సుల; నేఁటి కింత రూక్షతయేమో!

నీవంశము వాఁ డితఁడుఁ
గావం గలవాఁడు నేఁడు శాలిన్యముతో
నీ వెడ ద్రోహముఁ బూనెను;
భావుక శాపమున కేని పాల్పడకున్నే!

చాపము ధరించి పువ్వుల
తూపులు చేఁదాల్చి నీకుఁ ద్రోవంజూపన్
గా పున్నాఁ డతనుఁడు వే
వే పోదము పద! ముదమున విభుసన్నిధికిన్."

అను చెలిపల్కు లూతగ రహస్యపథమ్మున వెళ్ళుచున్న శ్వే
తను దలపైని కల్పకలతాంతము మీఁద సరోజయుగ్మమం
దున స్ఫటికాక్షమాలపయి దోషచరుండు కరాలు సాచి తాఁ
కెను; చలియో మఱేమొ! వడఁకెన్ గడకన్ గుడికన్ను మాటికిన్.

అపశకున మెంచి చింతించు నామె మనసు
నెఱిఁగి, మాటలందున మఱపింపనెంచి
దాసి దరిఁజేరు నంతలో— దారుణాతి
దారుణమ్ముగా రోధనధ్వని చెలంగె.

శ్వేత గమనవేగమ్ము హెచ్చించె; విహ్వ
లించె గుండియ లేదు పాలింపరాక
స్పష్టమై; పరిచారిక పలుకనెంచెఁ
గాని పెదవి కదలక కంగారుపడియె.

"నను విడనాడితివే ? నా
శనమైతివె ? పుండరీక ! సౌందర్యప్రపం

చన కింధనమైతివె ? సా
ధన మేమయ్యె ? బ్రతుకెల్ల ధంధనమయ్యెన్.

నిండుప్రాణిని బట్టి నిలువున నాహరిం
చితివిగదే ! మహాశ్వేత ! పాపి !
మదన ! దురాచార ! మగలు రేకెత్తించి
ముని మనస్సునం గొంప ముంచితివిర !
కొసరి లాలించెడు కూరిమి కొడుకుతో
శ్వేతకేతు ! ఋణము చెల్లిపోయె !
శారదా ! నేటితో జారిపోయెను గదే
నొసటి కుంకుమ రేఖ పసలు నీకు !"

అను కపింజలు భయదరోదనముం బట్టి
పసవి యేడ్చుచు గుండెలు బాదుకొనుచు
లతలు కంపలు నెత్తుపల్లములు దాటి
పర్వులెత్తి రివ్వుమను సర్వమును మఱచి.

ఇది

దౌత్యము



# నా స్వామి

శ్రీ. శే. గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు.

ఈరోగంబున కంతమన్నదియు లేనేలేదు దుర్వారముల్
ప్రారబ్ధంబులు భీమరూపమున నాపై నిట్లు దండెత్తె నీ
కారుణ్యంబు గడింప లేనయితి నో కల్యాణమూర్తీ, విప
త్పారావారము దాటుభాగ్య మిఁక లేదా యీవ్యథాజీవికిన్.

నీ కల్యాణగుణప్రభావముల వింటిన్ శైశవం బాదిగా
నీ కారుణ్యము సర్వలభ్య మనుకొంటిన్ నామనస్సౌధమం
దాకల్పించితి నీకు దివ్యము నమూల్యంబౌ మణీపీఠమున్
నీకై యింతతపించుచుంటి నను మన్నింపగ రావా ప్రభూ !

యోగీంద్రుల్ చిరసాధనోపగత సద్యోగాసనాసీనులై
రాగద్వేషనిరస్తచిత్తములనే రమ్యాకృతిన్ శాశ్వతున్
బాగొప్పన్ స్మరియించి, రట్టి నిను నాహ్వానించి ధ్యానింపఁగా
రాగద్వేషమయుండు వీనికొక యర్హత్వంబులేదా ప్రభూ !

నాదౌర్భాగ్యము నేమనందును జగన్నాథా! దయాసింధు! ఏ
పాదాంభోజరజంబుచే శిలలకుం ప్రాప్తించె చైతన్య మా
పాదంబే హృదయస్థమయ్యు సుఖరూపంబైన చైతన్యము
త్పాదింపన్ వెనుదీయుచున్నది తమః ప్రచ్ఛన్నమీ జన్మమున్.

పల్లెకులంబువాని మనుషం బరుగెత్తినప్రేమ- ఎంగిలిన్
చల్లగనేర్పుమై గుడుపఁజాలిన వృద్ధనుఁ బ్రోచుప్రేమ- లో
నుల్లసమొప్పఁగా సతి సహోదరు సాకినప్రేమ నాయెడన్
పొల్లయిపోయె నేమయ ప్రభూ ! జగదీశ్వర ! దీనబాంధవా !

హృదయంబన్నది లేక ఉన్నను తదీయైకాగ్రతల్లేక, దు
ర్మదమాత్సర్యపరీతవృత్తి మితిమీఱఁగ సర్వదా తామసా
స్పదమై అల్లరిగోతిమూకకును వశ్యంబైన యుష్మద్దయా
హృదయంబేటికి నాయెడన్ విముఖమయ్యెన్ చెప్పుమయ్యా! ప్రభూ!

ఉదధిం గట్టి ప్రశస్తిఁ గాంచిన మహాయోధాగ్రణీ! నీవు నా
హృదయాంతఃపరిఘూర్ణమానమగు ఈతృష్ణాబ్ధి బంధింపలే
వో! దయాన్వితుఁడవౌచు నాకడకు రావో! నన్ను లక్షింపవో!
ఇదియా కారుణికత్వలక్షణము? స్వామీ! నీవిధం బిట్టిదా?

పరమప్రాభవమూర్తివై పదితలల్ వానిన్ బహిశ్శత్రువున్
హరియింపన్ మును పెన్నిపాట్లు పడినావయ్యా ప్రభూ! నీవు సు
స్థిరరూపమ్మున వేనవేల్ తలలతోఁ జిత్తమ్మునన్ రేగు నా
యరిసంఘంబు జయింప నాకుఁ దరమౌనా? ఎంతయత్నించినన్.

తగునయ్యా స్మితపూర్వభాషి! త్రిజగద్బంధూ! దయాసింధు! నిన్
భగవంతున్ మది నిర్విరామముగ సంభావించి భావించి నా
యుగచాల్లం దోలఁగింప వేడితి! త్వదన్యత్రాత లేఁడంటి- నా
మొగమోటంబుఁ దలంపవైతివి లవంబున్ జెల్లునే నీకిటుల్?

చిరభక్తిప్రతిపన్నమంచు నిఖిలక్షేమోత్సుకంబంచు నీ
వెలుఁగన్ జాలుదు నాహృదంతరము తండ్రీ! ఏల నన్నింతఁగా
మొరవెట్టింతువు? చాలు చాలును దయాంభోరాశి నైరమ్ము- దు
ర్భరఖేదంబు నడంచి నన్నిపుడె సంరక్షింపు మార్తావనా!

పుడమిన్ వేదపురాణశాస్త్రముల నామూలంబు క్షుణ్ణంబుగా
పడవల్లించిన జ్ఞానవంతులగు విద్వన్నాథులే వప్పులో
నడుఁగుల్వైచిరి దుస్తరప్రకృతి మాయాముగ్ధులై- స్వామి! యీ
జడుఁడా శక్తిగలాఁడు కోరికల ఝంఝూటంబుఁ బోఁద్రోలఁగన్.

ఆశాపాశహతంబు చిత్తము వృథాయాసంబుతో సంతతా
వేశంబొప్పఁగ పర్వులెత్తినది దిగ్వీథీస్థలిన్- స్వార్థముల్
లేశంబైన గడింపనెంచినది కానీ యేమిలాభంబు ? స
ర్వేశా ! నీకృపలేమి సర్వమును లేనేలేదుగదా ప్రభూ !

దారుణయాతనావినిహతంబయి యీ అవిపక్వమాన సం
బూరక వెఱ్ఱియాసల సమోహమయమై పడియుండ నన్ను నీ
తీరని యంధకారమున ద్రిమ్మరు మంటివి చాలు చాలు నీ
కారుణికత్వముల్ విడచి గారడిచేయుచునుంటివా ప్రభూ !

న్యాయము ధర్మముల్ విడిచినానో భవత్పదపద్మసేవలం
దేయెడనైన మూఢమతి నేమఱినానో ! జగద్ధితంబులం
జేయఁగలేదొ ఆరసి వచింపుమయా ప్రభు ! నాప్రవృత్తియం
దేయపరాధమున్నదని యిట్లు విధించితి వీమహాపదల్.

ఏవేవో లవలేశముల్ సలిపినానే యంద- మాపమాత్రలో
దేవా ! ఇట్టి కఠోరశిక్షలకు నాదేశింతువా నన్ను ? బో
ధావిర్భావములేని పామరుఁడ మాయా మోహితాత్ముండ నా
యావద్దోషములున్ క్షమార్హములు గావా దీనమందారమా !

నీనామైకజపంబుచే నలయుచుండెన్ నిత్యముం జిహ్వా నీ
ధ్యానారంభపరిశ్రమంబున నితాంతం బున్మదావస్థకున్
లోనైయుండెను చిత్త-మింతకు దయాళూ ! నీకృపాదృష్టి నా
పైనం బర్వినజాడ గన్పడదు మద్భాగ్యంబు లీపాటివా ?

విడచితి సర్వసౌఖ్యముల విస్తృతపూ కవితాప్రపంచముల్
విడచితి జీవితంబు నడిపింపఁగఁజాలిన వృత్తిసైతముల్
విడచితి నీకఠోరపరివేదనఁ దీర్పఁగ నీపదమ్ములం
బడితి ననుగ్రహింప బ్రతిమాలితి నాదెసఁ జూడవింతకున్.

---

అక్షయపీడచే శిథిలమయ్యెను దేహము-సర్వథా పరా
పేక్షకమయ్యె జీవిత-మిసీ! హృదయవ్యథ దుర్నివార- మో
అక్షరరూప! నీకు హృదయార్పణముం బొనరించినందు కీ
శిక్ష విధింపలేదుగద? చెప్పను మాటలు వేయునేటికిన్?

దోసంబన్నది లేని జన్మమిది- ఏదో ప్రాగ్జనుఃకల్పిత
వ్యాసంగంబున దాపురించినవి దుర్వారంబు లీక్లేశముల్
నీ సేవామహిమన్ దరింతునని కొంటింగాని నానాటి కా
యాసల్ వ్యర్థములట్లదో చెడిని దేవా! ఎంతమోజించితిన్.

ఆతంకం బొకవంక దీర్ఘతరచింతాపాదకంబై విప
ద్వ్రాతం బింకొకవంక రేగ తనువున్ స్వాంతంబు నొక్కుమ్మడిన్
నీతస్వాస్థ్యములయ్యె నిస్పృహయు నావేశించె పైపెచ్చుగా
చేతన్ గవ్వయు లేని దుర్దశయు వచ్చెన్ జీవితం బెట్లింకన్.

చపలత్వం బనుమాట మానవజనుస్సామాన్యమా గాని నా
యుపభాగ్యంబో మత్తేమొ అయ్యది ప్రమాణాతీతమై యిట్లు నీ
చపుశ్రీవ న్నడిపించుచున్నది- ఉపేక్షాతత్వముంబూని నీ
కృప యేమూలనో దాచిపెట్టితివి స్వామీ! నీవిధం బిట్టిదా?

ఏదో మాటికి మాటి కింద్రియములన్ హీనేంద్రియార్థస్పృహా
స్వాదం బొక్కటి యావరించు- వెనువెంటన్ మానసంబున్ భవ
త్పాదాబ్జంబులకున్ రవంత యెడమై పర్వెత్త నుంకించు- నా
మీదన్ విచ్యుతిగాక యేమగును? సామీ! ఇట్టివే నాకథల్.

పరువుల్వెట్టును మానసం బొక మహాభాగ్యంబు నిశ్శంకమై
అరచేతం బడునంచు నాసఁగొని, భగ్నాశాంకురంబై తుదిన్
తిరుగన్ వచ్చు- రవంత నిన్నపుడు గుర్తించున్ ప్రభూ! కాని యా
పరుగుల్ దప్పవు తప్ప దాపతెసదౌర్భాగ్యంబు వెన్వెంటనే.

నిను సత్యప్రవణాత్మగమ్యుని తమోనీరంధ్రమౌ మానస
మ్మున నాహూతునొనర్పఁజాలు సుకృతంబుల్ గాంచగా లేక, నీ
యనుకంపాతిశయంబుఁ జూఱఁగొను భాగ్యమ్ముల్ గడింపంగ లే
క నితాంతంబును పల్వరింతుఁ బెరకాంక్షల్ వీడి నేనిచ్చటన్.

నీవా పచ్చహారాంగునీడవయిఁగా నీ తావులంజిమ్ము మేల్
పూవుందోటలఁ గాని లక్ష్మణముకుత్పుత్రుల్ పదాబ్జద్వయీ
సేవాతృప్తి సమాధవింప సతమున్ నీ శాకటాక్షామృత
శ్రీవిస్ఫారిత మోదమూర్తివయి వాసింజెందుమయ్యా! ప్రభూ!

అవని న్నీకెనయైన రక్షకుఁడు లేఁడంచున్ భవన్మానసం
బు విభాస్వన్నవనీతతుల్య మనియున్ శోధించు వృద్ధోక్తిపై
నవసన్నంబగుచుండు నమ్మకము, దేవా! నేఁడు నిన్నే శిలా
ప్రవణస్వాంతుఁడవంచు నేననిన తప్పా? నామనో దైవమా!

నీమూలమ్మున నర్థసిద్ధిఁ గన నేనిన్ సర్వలోకావన
ప్రామాణ్యంబగు భక్తియోగమె అపార్థంబౌను- కాకున్న నీ
సామర్థ్యంబది సంశయాస్పదమగున్ సర్వత్రవిఖ్యాతమౌ
నీమర్యాద కళంకితంబగును- ముందే చెప్పితిన్ నా ప్రభూ!

నిను దీనావన దీక్షితుండవని వింటిన్ నీపదాబ్జంబులన్
మనమం దెప్పుడుఁ గొల్చుచుంటి సభవా! మన్నింపరా వింతకున్
నను రక్షింపగ లేనిమాట నిజమైనన్ చెప్పు మామాటయై
ననుఁ గూర్పుండెడ నాసలన్ విడచెదన్ నాకర్మ మెట్లో యగున్.

ఆపన్మగ్నుఁడనై నిరాశలకు లోనై ప్రేలుచుంటిన్ ప్రభూ!
ఈ పాపంబునుఁ గూడ నాతలకు శంక్రీ! ఏల చుట్టింతు వ
య్యా పాషాణము నుద్ధరించితివిగాదా! ఉద్ధరింపంగ లే
వే? పాపాత్ముల? కట్టకొందరమె కానీ నాకు సర్వేశ్వరా!

నీతో వాదములాడఁ జాలను జగన్నేతా! భవత్పాదసే
వాతాత్పర్యముచే విపత్తులఁ దరింపన్నేర్తు నన్మాట ని
ర్ణీతం బయ్యెను- దానికిన్ తిరుగు లేనేలేదు నాస్వామి! నీ
ఖ్యాతప్రేమము నేటితోఁ దెలియు నయ్యా! తేటతెల్లంబుగా!
నిన్నున్ మానసపంజరంబునను బంధింపంగ జాల్ శక్తి నా
కున్నన్ నీవిటు చేయఁగాఁగలవె?- ఏదో తామసావేశ ని
ష్పన్నంబౌ నొకవేదనం బసితి దేవా! కాని యేనాటికే
ని న్నీ వాడను గాకపోవను సుమీ! నీవెంతగా గెంటినన్.

నాకంటెన్ మఱియొక్క దీనుఁ డిలఁ గానన్ రాడు నిక్కంబుగా
నీకంటెన్ మఱి దీనరక్షకుఁడు లేనేలేడు లోకంబులన్
కాకుత్స్థాగ్రణి! నీ యశోమహిమమున్ గాపాడుకోనైన నన్
పాకన్వచ్చుట నేడు తప్పదు సుమీ స్వామీ! కృపంజూడుమీ!

జయజయ దేవ! దేవహిత! సాధుజనావన! లోకపావనా!
జయజయ పాదపంకజరజఃపరిపాలిత గౌతమాలయా!
జయజయ రాఘవా! గిరిశ చాపవిభంజన! విశ్వరంజనా!
జయజయ పంక్తికంధర విశంసన పండిత! కీర్తిమండితా!

అథవా! మంగళ మద్రిజారమణవంద్యా! మంగళం బాత్మభూ
ప్రభవా! మంగళ మార్యసన్నుత చరిత్రా! మంగళం బుల్లస
ద్విభవా! మంగళ మార్తరక్షణ! యశస్వీ! మంగళం బర్కవం
శభవా! మంగళ మాదిదేవ! పరమేశా! మంగళం మంగళం!

శ్రీరామార్పణమస్తు.



# ఛందోదర్పణము — కొన్ని విశేషములు

## "ఒక విజ్ఞప్తి"

వాఙ్మయమహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

ఏగ్రంథరాజమునైనను నొకరాని నెవ్వరైనఁ బరామర్శింపవచ్చును. వీరు పరామర్శింపవచ్చును, వీరు పరామర్శింపరాదు అను నియమము లేదు. కాని యొకవిషయము నందఱును గమనింపవలయును. అది యేమన- ఆగ్రంథముపై నెవరెవ రేమేమి వ్రాసినారనునది. అట్లు గమనింపక వ్రాసిన నల్లరిపాలయి హేళనకు గురియగుట తప్ప వేఱుప్రయోజన ముండనేరదు. ఇట్టి గమనిక కేవల పరామర్శలు వ్రాయువారికే కాక ఆయా పరామర్శములఁ బ్రకటించు పత్రికాధిపతులకుఁ గూడ నుండియుండనగును- ఏలయన నొకరువ్రాసిన విషయము లేమరి యొకరు గొప్పగఁ దమవిగ మరియొకపరి వ్రాసి పత్రికల కెక్కవచ్చును. అట్టి సందర్భములలోఁ గేవలము వ్రాఁతరియె కాక యట్టి వ్రాఁతను బ్రచురించిన పత్రికాధిపతులును గొన్నియిబ్బందులకు గురియగుట కద్దు. అంతియ కాక వ్రాఁతరి యితరులైన వ్రాఁతకుల రచనలను వెదకియైన నన్నింటిని బఠించితీరవలయును. తాను విమర్శింపఁబూనిన రచయితల వ్రాఁత లన్నింటిని జదువకయె వారి వ్రాఁతలు విమర్శింపఁబూనిన హాస్యాస్పదుఁడగుట నిజము.

అవ్విధమున సమగ్రముగఁ బూర్వావలోకము చేయకయె వ్రాసిన కొన్ని విషయములను "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" సంపుటము ౪౭ సంచిక ౪ లో సంపాదకమహాశయులు ప్రకటించిరి. "ఛందోదర్పణము-కొన్ని విశేషములు" అను శీర్షికతోఁ బ్రకటించిరి. ఈవ్రాఁతలను గూర్చి నాల్గుమాటలు నేను వ్రాయుటకు ముందుఁ బెద్దలకు నొక్కమనవి.

నేను నాంధ్రవాఙ్మయమునఁ బరిశోధనకు దొరకొనుట సత్యాన్వేషణాసక్తిచేతనే గాని యన్యముకాదు. నేనెప్పుడైనఁ బ్రమాదవశమున

వ్రాసిన వానిని దెల్పినవారికిఁ గృతజ్ఞతలు తెల్పుస్వభావము గలాఁడను. ముఖ్యముగ మొండివాదములు చేయుట నాస్వభావముగాదు. నాలో నట్టివి యెవో కొన్ని యభిప్రాయములు పెట్టుకొని వాని నిరూపణచేయుటకై తాపత్రయపడను. సాహిత్యావలోకనములో నాకనులఁబడిన నా బుద్ధికిఁ దోచిన విశేషములు తెల్పుదును- సత్యాన్వేషణలో నావాదమును దేనినైన నుపసంహరించుకొనవలసివచ్చినచో నట్టిపని చేయుటను నేను వెనుకాడను- అవమానకరమని తలంపను- అది నాసత్యాన్వేషణ పరతత్త్వము- ఈవిషయమెల్లఁ బ్రసిద్ధులైన మన పరిశోధకుల కెల్లరకుఁ దెలియును. ఇట్టి నాసద్గుణమును (గొప్పకుఁ జెప్పుకొనుటలేదు.) దోటి పరిశోధకశిఖామణు లనేకులు చాటుగఁగూడ మెచ్చుకొనుట నే నెఱుంగుదును. ఈసందర్భమున నాయభిప్రాయములే సత్యములని వాదించువాఁడను గానని పెద్దలైనవారికి మరొకసారి మనవిచేయుచున్నాను-

45వ సంపుటము 3వ సంచికలో "ఛందోదర్పణము--కొన్ని విశేషములు" అను శీర్షికతో వెలువడినదానిలో మొత్తము పరామర్శింపఁబడిన నైదువిషయములు.

## (1)

ఇందు "ఒక్కనెలపున నెనిమిది యొకటనాల్గు" అను ననంతుని పద్యార్థము పరామర్శింపఁబడినది. ఈపద్యవిషయమున శ్రీ రావూరి దొరసామిశర్మగారు చెప్పిన యర్థమె సరియైనది- ప్రత్యేకముగ నసర్థకముగ మనకవిత్వమందుఁ జొనుపు నావశ్యకను లేదు- అనంతుని పద్యమును సగమునకు సగము దిద్దవలసిన యావశ్యక మేమున్నది? శ్రీ రావూరి వారు చెప్పిన యర్థమునను స్వారస్యమున్నది. వేరర్థమునఁ బెక్కుదోషము లున్నవి- వానినెల్ల వివరించుట నాపనికాదు. ఇంకముందవసరమైనఁ దప్పుదు.

(2)

ఇందు "వైసాదృశ్యంబులు పరిహారణీయంబులు" అను పాఠము తప్పనియు "వైసాదృశ్యంబు లపరిహారణీయంబులు" అను పాఠము సరియైన దనియుఁ బ్రతిపాదింపఁబడినది. ఈవ్రాఁతరి చెప్పిన విశేషమేమియు లేదు- ఈసవరణ నేను ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 39 సంపుటము 1-3 సంచికలో "ఛందోదర్పణవిశేషములు" అను వ్యాసములోఁ జేసి చూపితిని- (చూఁడుఁడు- ఆం. సా. ప. పత్రిక- 39వ సంపు- 1-3 సంచిక 24 పుట- చివరి రెండుపంక్తులు.) తిరిగి దానినె వ్రాసిన యీ వ్రాఁతరి యీపత్రికలో నావ్యాసము చూచి వ్రాసినదే. ఈవ్రాఁతరి యీసంచిక చూచెననుటకు సాక్షి యీవ్యాసముననె నేను బ్రతిపాదించిన "అజయనంగను" నను పద్యవిమర్శమును బరామర్శించుట- కావున నేను వ్రాసిన విషయమునె తిరిగి వ్రాయుటయుఁ బత్రికాధిపతులు ప్రకటించుటయు సరికాదు.

(3)

సంయుతప్రాసము విషయమైయున్న "పాడుసూడు" అను పద్యమున నీవ్రాఁతరి చూపిన విశేషము లేదు. వీరు చూపిన సవరణ కొవ్వూరు సంస్కృతకళాశాలలోఁ బాఠప్రవచవేళ నక్కడనున్న యధ్యాపకులు చేసినది. ఇటీవల నాకళాశాల పూర్వవిద్యార్థిసంఘసమావేశ సందర్భముగ నేను గొవ్వూరు వెడలగా నక్కడ నొకవిద్యార్థి పుస్తకమున నీసవరణ చూచితిని * వాస్తవమున కీసంయుత ప్రాసతత్త్వము పేఱు- ఆవిషయమునెల్ల 1952 ఆగస్టునెల సుభాషిణి పత్రికలోఁ బరామర్శించితిని. సెప్టెంబరు సంచికలో "పాడునూడుప్రోలు" అను పద

* ఈవ్రాఁతరి కొవ్వూరు విద్యార్థియని 205వ పుటలోని వ్రాఁతలవల్లఁ దెలియును. నేనును నచటివిద్యార్థినే గాని "కవిజనాశ్రయము తిక్క-" తిక్కన ఛందము చెప్పియు నేను గురువులకడఁ జదువలేదు. నేఁ జదివినప్పుడు "ఛందోదర్పణము" పాఠ్యగ్రంథము కాదు.

ములు తదితరములకు ననుపలక్షణములని 20వ పుట సవరణలోఁ బ్రతిపాదించితిని. ఆవిషయమై యీవ్రాఁతరి చెప్పుట యింత-

భాగ్యవంతుఁ డేలు పాళులు నూళులు
ప్రోళులయ్యెఁ బ్రాఁతె కూళలిచట

అను పాఠము సరికాదనియు నాసందర్భమున వసంతుని యభిప్రాయము మఱొకటనియు నా "సుభాషితి" లో వివరించితిని. ఇంక నీవిషయమున నీవ్రాఁతరి స్వంతయభిప్రాయ మేమియు లేదు.

(4)

ఇందు "అఱయువంగను" అను పద్యవిషయము ప్రతిపాదింపఁబడినది. "అరుసన్వ" అను నెడ వసంతుఁ డేల సంధిచేసెనని యీవ్రాఁతరి ప్రశ్నము. ఒకచో సంధిచేయుకున్న నన్నిచోటులను జేయరాదని నియమమెక్కడ? ఎవ్వరైన నన్నింతురా? ప్రత్యేకనిర్దేశము చేయుటలో సంధిచేయకపోవుట దోషముకాదనిమాత్రమే నేను వ్రాసితినిగాని సంధిచేయనేరాదని నేను వ్రాయలేదు. సంధిచేసిన చేయవచ్చును. చేయకపోయిన దోషముకాదు. అటుఁ జేయనివాఁ డిట నేల చేయలేదని ప్రశ్నించుట సరికాదు. ఈవ్రాఁతరియు విసంధివిషయమున నింతగా భారతము చదివి "అప్ప అయ్య" అను పద్యము నుదాహరించుచు "అప్ప యయ్య యన్న" యని "య" డాగమరూపములు గలవాని నేల యుదాహరింపలేదు? లోగడ నే విన్నవించినట్లు ప్రత్యేకనిర్దేశములలో సంధిచేయవలెనను నియమ మెట్లు లేదో యట్లే "య" డాగమమునకును లేదు. ఇట్టి విసంధుల విషయమున నీవ్రాఁతరి తాళపత్రప్రతుల నొకపరి తిలకించినఁ దెలియఁగలదు.

"అఱువనంగనుబోవు ననర్థమైన" అని యీవ్రాతరి సవరణ. పోవును + అని + అర్థమైన అని విభాగము కాఁబోలు. ఇట వ్యాఖ్యాతృనకు సంధివిషయము విడిచినను "పోవు + అనర్థమైన" అని యనర్థస్ఫురణ కవకాశమున్నది. రామయ్యవంటి చోటులనే సంధికావలెననుట

పరికాదు. రూపములఁబట్టి సూత్రములుకాని సూత్రములఁబట్టి రూపములు కావు. లోకవ్యవహారమునుబట్టి వచ్చినవే యివి యన్నియు. అయినప్పుడు మానవునకేమైన నలుపుకలిగినప్పుడో కాని పని నెరవేరినప్పుడో "అమ్మయ్య" యనుట స్వాభావికము. ఇవ్విధమున "అమ్మయ్య" అని సంధిసహితముగఁ బ్రయోగించిన కవుల ప్రయోగములు కలవు. (మరొక వ్యాసమున వానిని వివరింతును) అయినప్పుడు ప్రౌఢవ్యాకరణకర్త సూత్ర మేమగును?

(5)

ఇందుఁ "బుష్మసింహో" అనుదాని విషయము ప్రతిపాదింపఁ బడినది. దీనివిషయమై నేను "సుభాషిణి" (సెప్టెంబరు 1952) లోఁ బొరపాటుగ వ్రాసినది వాస్తవమే. ఆపొరపాటును నీవు చెప్పవలవసరము లేకుండ నేనే గమనించి నాపొరపాటును నేనే అక్టోబరు "సుభాషిణి" లోఁ బడిన నావ్యాసముచివర "పాఠకులకు మనవి" అని జరిగిన పొరపాటు మనవిచేసి సవరించుకొన్నాను. (అక్టో. సుభాషిణి- 38 పుట చూ.) ఇంక నన్ని వ్రాఁతరి "బూకరింపులబుంగ" యనవలసిన యగత్యము లేదు. నేనే చేసుకొన్న యుపసంహరణను మరుగుపరచి తామేదో ప్రత్యేకముగ నెఱింగినట్లు వ్రాయుట హాస్యాస్పదము.

ఊరక నేరము లారోపించి యొకరిని దూషించుటయె ధ్యేయముగ నెవరో వ్రాసినవె వ్రాసి కొన్నిటిని జూడకయె చూచి మరుగు పఱచియో గాలిపోగుచేసి వ్రాసిన వ్యాసనామకములైన వ్రాఁతలను బ్రకటించుట పత్రికాధిపతుల గౌరవమునకు భంగకరమని విజ్ఞప్తి చేయుచున్నాను. నేను ఛందోదర్పణముపై "త్రిలింగ" ఆంధ్రప్రభ- సుభాషిణి (మూఁడుసంచికలలో వరుసగా) ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలలో వ్యాసములు కొన్ని వ్రాసితిని. వాని నన్నింటిని పరికించి తప్పుఁగలవారలు వ్యాసములు వ్రాసిన హాస్యాస్పదులు కాకుందురని విజ్ఞప్తిచేయుచున్నాను.

---

# శివస్వరూపము

శ్రీ బొడ్డపాటి వెంకటసుబ్బారావు, ఎం. ఏ.,

గల్పించుకొని, కామోద్రిక్తవాక్కులను బల్కు యక్షుఁడుసయితము శివుని ప్రసన్నునిఁగఁ జేసికొనవలసిన దనియు, భక్తివినమ్రుఁడై పాదచరణన్యాసమునకుఁ బ్రదక్షిణము సల్పవలసిన దనియు, తనస్నిగ్ధగంభీర ఘోషచేఁ బశుపతికిఁ గావలసిన సంగీతసామగ్రి సమకూర్పవలసిన దనియు, పలుమార్లు తెల్పినాఁడు. కాముని నిగ్రహించిన శివుఁడు కాముని కెట్లు ప్రసన్నుఁడు కాఁగల డను ప్రశ్నకు శివపార్వతీపరిణయమే ప్రత్యుత్తరము. 'సుషుమ్నా నాడికిఁ బార్వతి యని పేరు. మేరుదండము (వెన్నెముక) హిమాలయము. ఇందే సుషుమ్నా నాడి కలదు. ఈ మేరుదండమందు ఆఱుచక్రములు, ముప్పదిమూఁడు పర్వములు లేక యెముకలకీళ్లును గలవు. ఇవి యొకదానితో నొకటి దగ్గరగఁ జేర్చఁబడి యున్నవి. ఈ మేరువే పర్వతము (పర్వాణి సన్త్యస్య). ఈ పర్వతములోనుండు సుషుమ్నా నాడియే పర్వతరాజకన్య యగు పార్వతి. ఈ యెముకకీళ్లలో నొకరంధ్రము కలదు. కీళ్లన్నియు దగ్గఱదగ్గఱగాఁ జేర్పబడియుండుటచే నా రంధ్రము పొడవైన గొట్టమువలె నైనది. దీనిలో సుషుమ్నా నాడి గలదు. ఈ నాడి మెదడునుండఁబోయి వెన్నెముకభాగమున నవస్థితమై, అన్నిటికంటెఁ గ్రిందుగనున్న మూలాధారచక్రమువఱకు వచ్చును. కీళ్లయెముకలలో మొదట తెలుపుగనున్నట్టియు, పిమ్మట విభూతి లేక బూడిదవర్ణము గల్గిన క్రొవ్వుపదార్థము నిండియుండును. అట్టిదియే మెదడువందలి భాగములందుఁగూడ నుండును. ఈమజ్జామయమైన సుషుమ్నా నాడియందుఁ గ్రిందనుండి పైదాఁకఁ బోవునట్టి సూక్ష్మరంధ్రము కలదు. సుషుమ్నా నాడి కెడమవైపున 'ఇడ' (ఇళ) యనునట్టియు, కుడిప్రక్కను 'పింగళ' యనునట్టియు నాడులు ప్రసరించియున్నవి. ఇవియు సుషుమ్నా నాడి సంబద్ధములై వేయి విధముల వ్యాపించుచుఁ జివరకుఁ గపాలమం దాజ్ఞాచక్ర

ములో సుషుమ్నానాడితోఁ గలసిపోవుచున్నవి. ఈ నాడులన్నియుఁ బ్రాణవాహికలే. ఇంకఁ బ్రాణమే జీవనతత్త్వము.

భౌతికపక్షమున నాడీజాలము లన్నియు, షట్చక్రములు, ప్రాణమున కాధారములు. నాడులసూక్ష్మత్వమున కంతము లేదు. యోగశాస్త్రప్రకారము వానిసంఖ్య 72000 ఆధునికశరీరశాస్త్రజ్ఞులకుఁగూడ సమస్తనాడులసంఖ్యయు నిర్ధారణపూర్వకముగఁ దెలియదు. అన్ని నాడులయందును ముఖ్యమైనది సుషుమ్నానాడియే. స్థూలశరీరశాస్త్రమునకు జీవనతత్త్వముయొక్క భౌతికాధారముమాత్రమే యవగతమైనది. దానిభోగాయతనరూపము లేక స్థూలరూపము ప్రయోగసాధ్యము (experimental) కాన యోగవిద్య మానసికపక్షమునఁ గూడఁ బ్రాణముయొక్క చలనము నిర్దేశించి, దానినిగూర్చి సూక్ష్మనివేదన చేయును. భౌతికప్రయోగముచే నేవస్తువునుగూర్చి తెలిసికొనలేమో యా శారీరకరహస్యములే మానసికక్రియతోఁగూడ దీనివలన ధ్యానమందు ప్రత్యక్షముగ గోచరించును. తాంత్రికగ్రంథములందు దీనిని రెండువిధములుగ వర్ణించిరి. కొన్నిచోట్ల భోగాయతనపక్షమందు, శరీరపురూపమందు, జీవనతత్త్వముయొక్క అధిష్ఠానమును విశదీకరించుటయందు 'సుషుమ్నా' మొదలగునామములు ప్రయోగింపఁబడినవి. మఱికొన్నిచోట్ల ఆవర్ణనమునకే ఆధ్యాత్మికస్వరూపమును గల్పించి శివ, పార్వతీ, కుమార, ప్రమథాదినామములు కల్పించి యోగప్రత్యక్షమైనదానిని శబ్దములచే వ్యక్తపఱుపఁబడినది. షట్చక్రములస్థానముల క్రమ మిట్లున్నది.

(i) మూలాధారచక్రము:-(కాక్సిజియల్ రీజియన్ Coccigial Region ఇది గుదస్థానముతో సంబంధించినది. ఇందు నాల్గుపర్వములు (వర్టిబ్రే Vertebrae) ఇవి పైనున్న పర్వములకన్నఁ జిన్నవిగను, అపరిపూర్ణముగను నున్నవి. ఈ నాల్గును వేఱువేఱుస్వరూప

ములతోఁగాక యొక్క యెముకవలెనే కానిపించును. దీనిని ఆంగ్లమున 'కాక్సిక్స్' (Coccix) అందురు. 'కేకసా' యనెడు అస్థి యిదియే యని శోధించుచున్నది. కుండలినీశక్తి యిచటనే నివసించును. శివపార్వతీవివాహమున కుండలిని మేల్కొల్పి బ్రహ్మాండము అనఁగా మస్తిష్కములోనికిఁ గొనిపోవుదురు. దీనినే యోగపరిభాషలో సర్పిణి యందురు. ఏలన, నిది సర్పిణివలె చుట్టుకొని నిదురించుచుండును. మూలాధారచక్రమందు పృథ్వీతత్త్వము కలదు.

(ii) స్వాధిష్ఠానచక్రము :— (సేక్రల్ రీజియన్ - Sacral Region) ఇది లింగస్థానమం దధిష్ఠితమై యున్నది. దీనిలో నైదు యెముకలు కలవు. ఈ యైదింటినిగూడఁ గలసియేయుండును. దీనిని ఆంగ్లమందు 'సేక్రమ్' (Secrum) అందురు. ఈ రెండుభాగములలోని తొమ్మిదికణుపులను వదిలి, వెన్నెముకయందలి మిగిలిన 24 ఎముకలనే లెక్కింతురు. కాని, భారతీయులుమాత్ర మీనాశక్తిని 33 ఎముకలతోఁ గూడియున్నట్లే యెంచిరి. స్వాధిష్ఠానచక్రమందు జలతత్త్వ మున్నది.

(iii) మణిపూరచక్రము :— లంబర్ రీజియన్ (Lumber Region). దీనిస్థానము నాభిప్రదేశము. ఇచటి వెన్నెముకయందు 5 పర్వములు కలవు. తేజము దీని తత్త్వము. ఈ మూఁడుచక్రములను భేదించినపిమ్మటనే యోగి విరాట్భావసమన్వితుఁ డగును. అతని మోహనిద్ర యంతరించును.

(iv) అనాహతచక్రము :— 'డోర్సల్ రీజియన్'- (Dorsal Region) 12 పర్వములు గల్గిన వెన్నెముకయందలి యీచక్రము హృదయస్థానమందుఁ గలదు. ఇది వాయుతత్త్వమునకు స్థానము.

(v) విశుద్ధచక్రము:—'సెర్వికల్ రీజియన్' (Cervical Region) ఇందు 7 కణుపులు గలవు. ఇది మెడయందుఁ గలదు. ఇచటనుండియే

ఆకాశగుణము గల్గిన శబ్దము లుద్భవించును. దీనిని భేదించినపిమ్మట యోగికి ఆకాశతత్త్వముపై విజయము చేకూరును.

(vi) ఆజ్ఞాచక్రము :- మస్తిష్కప్రదేశమున భ్రూమధ్యమున లేక త్రికుటియందు నీచక్రము కలదని యోగు లందురు. ఇచట సుషుమ్నానాడి యంతరించును. ఇచటనే మనస్సు, బుద్ధి, అహంకారము లుండును. ఇచటనే జ్ఞానచక్షు వనెడి మూఁడవకన్నుండును. ఇదియే శివుని వాసస్థానము.

యోగి కైదుచక్రములపై నధికారము కల్గినపిమ్మటఁ గామబాధ యతనిని బీడింపలేదు. శివునిగూర్చి కాళిదాసునివాక్య మిట్లున్నది— 'అరూపహార్యం మదనస్య నిగ్రహాత్' —కాముని నిగ్రహించినవాఁడగుటచే; రూపము అనగా సౌందర్యము. అతనిచిత్తమును హరింపలేదని భావము. మున్ముందు శివుఁడు మన్మథుని భస్మముచేసివైచెను. (భస్మావశేషం మదనంచకార) అటుపిమ్మటనే పార్వతిని వివాహమాడి షణ్ముఖుని బుత్రునిగఁ బడసెను. ఆజ్ఞాచక్రముకంటెఁ బైనున్న సహస్రదళపద్మమందు (సెరెబ్రెల్ రీజియన్ Cerebral Region) సాక్షాచ్ఛివుఁడు వసించును.

శివునియొక్క స్కందితతేజముచేఁ గుమారస్వామి జన్మించెను. ఈ తేజము పార్వతీరూపమైన సుషుమ్న (2) యందు నిక్షిప్తమై

---

(2) సుషుమ్నా:— సుమ్న=ఆనందము, 'షుక్=అభిషవే' ధాతువునుండి 'సుమ్న' అగును. షట్చక్రముల భేదించినతరువాత స్కందుఁడు జన్మించును. స్కందునిసంబంధము లోకమున 'ఆరు' సంఖ్యతో నధికముగఁ గలదు. షడానన, స్కంద, షష్ఠి మొదలగునవి పేర్లు గలవు. శ్రీ ఆర్థర్ ఏవలెన్ పండితుఁడు చిత్రించిన ఆజ్ఞాచక్రచిత్రమందు కుమారస్వామి షడాననుఁడుగఁ జిత్రింపఁబడినాఁడు.

క్రమముగ నాఱుచక్రముల (3) చే బుష్టిచెంది పెంపఁబడి స్కంద నామమున జన్మించును. ఇందువలననే ఆర్షకుమారాతలకుఁ బుత్రీ తుల్యుఁ డగుటచేఁ గుమారస్వామి షాణ్మాతురుఁ డని పిలువబడు చున్నాఁడు. మేఘదూతయందుఁ గాళిదాసు స్కందుని జన్మరహస్య మును సూత్రప్రాయముగ నుదాహరించినాఁడు.

> తత్రస్కందం నియతవసతిం పుష్పమేఘీకృతాత్మా
> పుష్పాసారైః స్నపయతు భవాన్ వ్యోమగంగాజలార్ద్రైః।
> రక్షాహేతోర్నవ శశిభృతా వాసవీనాంచమూనా
> మత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః॥
>
> (మే. దూ. 1–47)

అచట దేవగిరిపై నివసించుకుమారస్వామిని నీవు నీపుష్పాత్మక రూపమును జెంది యాకాశగంగచేఁ దడిసిన పుష్పవృష్టితో స్నానము చేయింపుము. దేవసేనను రక్షించుటకై పావకుని నోటియందు సంచితమైన యగ్నితేజముకన్న మిన్నయగు తేజము గల్గిన శివతేజమే సుకుమారస్వామి- 'అత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః- ఇదియే స్కందశబ్దమునకు నిర్వచనము. హుతవహుఁడు అనఁగా అగ్ని నామకమైన సుషుమ్నా నాడిముఖమందున్న, సూర్యునికన్న నధికప్రకాశితమైన శివతేజమే స్కందుఁడు. నిఘంటువులందు స్కందునిభార్య

---

(3) షట్చక్రములు సుషుమ్నానాడియందే యుండును. శరీరశాస్త్రమందు, సుషుమ్నానాడి అయిదు సహజవిభాగములుగఁ జేయబడినది. ఆఱవది, అన్నింటికంటె పైనికలదు. అచట సుషుమ్నా (Spinal Cord) క్రాంచరంధ్రముగుండ Magnum Foranam అనగా పెద్దరంధ్రముద్వారా మెదడున (బ్రహ్మాండమున) వ్యాపించును. ఈ పంచచక్రములకు సంబంధించిన శక్తిప్రవాహినీనాడులు క్రమముగ గుద, లింగ, నాభి, హృదయ, కంఠస్థానములతో సంబంధించియున్నవి. ఉదాహరణకు మణిపూరచక్రము నాభిదేశమును శాసించును. కాని యదియుండుటమాత్రము సుషుమ్నయందే. ఇట్లే మిగిలినస్థానములందుకూడ నుండును.

దేవసేన యని చెప్పఁబడినది. ఇంద్రియములయొక్క సాత్త్విక తామసిక ప్రవృత్తులద్వంద్వమే దేవాసురసంగ్రామము. సత్త్వగుణసమన్వితములైన యింద్రియము లెప్పుడు కామముచే నోడింపఁబడ మొదలిడునో యప్పు డవి సమాధిస్థితుఁడైన శివునిగూర్చి యొకసేనాధిపతిని ప్రసాదింపుమని ప్రార్థించును. దేవతలుకూడ నిట్లే ప్రార్థించిరి.

తది చ్ఛామో విభో స్రష్టుం సేనాన్యం తస్య శాంతయే
(కు. సం. II—51)

అసురుల నోడించుటకై మా కొకసేనాపతి కావలెననుట. శివుఁడు మదనుని దహించివైచెను. పిమ్మట, నుమయొక్క తపస్సువలన ననఁగా సుషుమ్నానాడి ద్వారమున యోగసాధనచే శివపార్వతుల వివాహము జరిగెను. అనఁగా నధోముఖముగనున్నట్టి వ్యక్తియొక్క చిదాత్మశక్తి యంతర్ముఖమై సహస్రారదళమందున్న పరబిందురూపమైన శివునితోఁ గూడును. పిమ్మట విషయములతో (నింద్రియములతో) నావ్యక్తి కెట్టిబాధయు నుండఁబోదు. ఏయింద్రియములు మిగిలిన వానినన్నిటిని మథించునో యవియే ప్రమథులరూపమున శివపార్షదులై (పరిషది, సాధు) యుండును. "అత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః"— అనుదానిని తెలిసికొనుటకై నాడులయొక్క నామముల నెఱుంగుట ముఖ్యము.

సుషుమ్న=వహ్నిస్వరూప, సరస్వతి; లోహితవర్ణ.

ఇడ=చంద్రస్వరూప, గంగ, సద్గుణి, అమృతవిగ్రహ, పీతవర్ణ.

పింగళ = సూర్యస్వరూప, తైజసవర్ణ, రౌద్రాత్మిక, వజ్రిణి, యమున, రాజసి.

సుషుమ్నకు 'వహ్ని' లేక 'హుతవహ' యనిపేరు. తన తేజము నీవహ్నిలో హవనము చేయుటచే శివుఁడు యాజ్ఞ్యుఁడని పిలువఁబడుచున్నాఁడు. సాధనలో పురుషుని తేజ మీవహ్నిముఖమందే సంచిత

ముగ నుండును. ఆఅచక్రములను భేదించినపిమ్మటనే దేవసేనను అప రాజితముగఁ జేయుపట్టి అజేయుఁడగు కుమారస్వామి జన్మించును. పురాణముల ననుసరించి, ఆజన్మబ్రహ్మచారియగు నతఁడే కుమారుఁడు. సహస్రారదళమందున్న శివుఁడే అక్షరతత్త్వము. అచట సమస్త బ్రహ్మాండసంబంధియైన చిచ్ఛక్తి కలదు. మూలాధారచక్రమం దొక శక్తిపీఠము కలదు. అందు వ్యక్తియొక్క శక్తి నివసించును. ఆశక్తికి ఇచ్ఛా, జ్ఞాన, క్రియ లనెడి మూఁడుకోణములు గలవని చెప్పబడినది. ఈమూఁడింటిపేరే త్రిపురములు. వీనిమధ్యనుండు శక్తియే త్రిపుర సుందరి యని ప్రసిద్ధికెక్కినది. ఈత్రిపురము లేక త్రికోణము మధ్య కుండలితమై శాంతముగ నివసించియుండు శక్తినే శబ్దగతకల్పనచే 'సర్పిణి' యనినారు. ఇందుచేతనే శివుని శరీరమును భుజంగములు చుట్టుకొని యున్నట్లును, శివుఁడహివలయ ధారి యనియు వర్ణించినారు.

"హిత్వాతస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా
క్రీడాశైలే యది చ విచరేత్ పాదచారేణ గౌరీ"

(మేఘ. దూ. I—64)

మూలాధారమం దీసర్పిణి శివరూపజ్యోతికి నలువైపులఁ జుట్టు కొని యుండును, కాని ఆజ్ఞాచక్రమును భేదినపిమ్మట, శివపార్వతీ సంయోగమైనపుడు, కుండలిని, శివుఁడు దాని సర్పవలయములను త్యజించినాఁడో యనునట్లు విడివడిపోవును. శరీరశాస్త్రమును దృష్టియం దుంచుకొని దీనినిఁ బరీక్షించినచో నిట్టి త్రికోణాత్మక శక్తిరూపము, శల్యశాస్త్రమున గోచరింపదు. మానసపక్ష సంబంధమగు విషయము యంత్రముద్వారనునుఁ దెలిసికొనుట యెట్లు? దీనిని యోగపక్షమున ధ్యానముచే దర్శింపవచ్చును. (4) జ్యోతి (తేజస్స్థలింగము) ఆకార

---

(4) కేంద్రమందున్న నాడీజాలముల నిర్మాణ మతిజటిలము. ఆ కేంద్రసమూహములలో ఘటికాబిందువులలో (Nerve Centres) ప్రతంత్రులలో జరిగెడి సంవేద నాత్మక, సంకల్పాత్మక కార్యము లింతవఱకు తెలిసికొనఁబడలేదు. భారతీయ

మందున్న శివలింగము దీనికి ప్రతీకము. ఈశక్తియొక్క త్రికోణమును అనఁగా త్రిపురమునే శివుఁడు జయించును. ఇందుచే శివుని పేరు త్రిపుర విజయుఁడు. మేరుదండరూపమైన (వెన్నెముక) పార్వతికి ఒక స్థాన మున్నట్టి ప్రదేశము పేరే కైలాసము. మేరుదండముయొక్క పైయగ్రమే కైలాసము. అచటనే ఆజ్ఞాచక్రము కలదు. ఇచట కైలాసముదగ్గఱనే అలకాపురి కలదు. ఇచట కామదేవుఁడు తన చాపమునకు శరమును సంధింపఁడని కాళిదాసుని పల్కు.

> "మత్వా దేవం ధనపతిసఖం యత్రసాక్షాద్వసన్తం
> ప్రాయశ్చాపం న వహతి భయా న్మన్మథః షట్పదజ్యమ్"
>
> (మే. దూ. II—14)

(కైలాసోత్సంగమందున్న అలకాపురి సాక్షాత్తు శివుని నివాస మని యెఱిఁగి మన్మథుఁడు తన షట్పదశ్రేణియను నారిగల్గిన వింటి నుపయోగించుటకు సాహసింపఁడు.)

ఉచితమే. ఆజ్ఞాచక్రము వఱకును సిద్ధినిపొందిన యోగిపుంగవునిఁ గామబాధ పీడింపఁజాలదు. అందుచే నిచట, హిమాలయమందే కిన్నరులు గుమిగూడి త్రిపురవిజయగీతమును పాడుదురు.

> "సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః"
>
> (మే. దూ. I—60)

---

యోగులు దీనిని ధ్యానమందు ప్రత్యక్షీకరించుకొనిరనిన నేమాత్రము నాశ్చర్యముకాదు. చైతన్యమునకు గల భౌతికాధారము, దానిలోని కొలది యంశమునుగాని, దాని స్వరూపమునుగాని రెుఱుకపరచునని విజ్ఞప్తియందుంచుకొనవలసిన విషయము. కొందఱు భోగాయతనపక్షమందు (శరీరమందు) చైతన్యముయొక్క ఆధారమును గుర్తింపలేక దాని యవస్థితినే సందిగ్ధమని నిర్ణయింతురు. చేతనము (చిదాత్మశక్తి) మనోవిజ్ఞానముతో సంబంధము గల్గియున్నది. భౌతికనిర్మాణమందు దాని అభ్రాన్తాభాసముమాత్రము గోచరించును. ఇందుచే భౌతికనిర్మాణమును దీనికి ప్రమాణదండముగ గ్రహింపలేము.

శివునకు కుబేరునకు సఖ్యభావము గనుక అచటనే ధనపతియొక్క విజయమునుగూర్చికూడ కిన్నరులు పాడుదురు.

"ఉద్గాయద్భిః ధనపతియశః కిన్నరైర్యత్రసార్థమ్"

(మే. దూ. II–10)

ధనపతియైన కుబేరుని యనుచరుడే యక్షుఁడు. అతఁడు కామరూపియగు తనదూతకు (మేఘునకు) వీలుదొరకినంతనే శివుని యుపాసన చేయవలసినదని యాజ్ఞాపించినాఁడు.

పార్వతికి 'గుహా' యనియు, స్కందునికి 'గుహ' యనియు, యక్షులకు 'గుహ్యకు' లనియు నామాంతరములు గలవు. ఈవిధమునఁ గూడ వారి పరస్పరసంబంధము సూచింపఁబడుచున్నది. యక్షుఁడు సాక్షాత్తు కామమూర్తియే. అతని కన్నులనుండియే కామము బింది౦చుచుండును. ఇట్టి కామపూరితుఁడైన వ్యక్తి అవశ్యము 'గుహ్యకుఁడు' లేక రక్షింపఁబడవలసినవాడే. ఏదేవుఁడు మన్మథుని భస్మావశేషునిగఁ జేసెనో, తిరుగ నెవని అనంగజితరూపమునుండి, సేనానియగు 'గుహుఁడు' (5) జన్మించియుండెనో, అతనినే యక్షుఁడు ఆత్మరక్షణకై యాశ్రయించును.

శివుఁడు పినాకపాణి.

"అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతిమాప్తు మిచ్ఛతి"

(కుమార. సం. V–53)

---

(5) గూహతి రక్షతి దేవసేనా మితి గుహః
ఇః కామః అక్షిషు యస్య స యక్షః

(భానుజీ దీక్షితులు)

—అనఁగా నెవఁడు దేవసేనను రక్షించునో అతఁడు గుహుఁ డనియు, ఎవని కనులలోను కామము నిండియుండునో అతఁడు యక్షుఁ డనియు నర్థము.

శివుని ధనుస్సును పినాకమందురు. నిరుక్తమందు 'పినాక' శబ్దమునకు

రంభః పినాకమితి దండస్య

(నైగమకాండ III—4)

అనఁగా దండమునకు "రంభ, పినాకము" లను నామములు కలవని అర్థము. అచటనే "కృత్తివాసాః పినాకహస్తో ఽవతతధన్వేత్యపి నిగమో భవతి" యని లిఖింపఁబడియున్నది. మేరుదండమునకు (వెన్నెముకకు) పినాకమను పేరే గలదు. ఇదియే శివుని ధనుస్సు. ఈదండాకారమైన ధనుస్సునకు రెండు చివరలు లేక అగ్రములు గలవు. క్రింది కొన మూలాధారచక్రమందుఁ గలదు. అచటనున్న కుండలినే పినాకమునకు (వింటికి) 'ప్రత్యంజ్య' నారిగా కల్పించి, దాని రెండవ కొనను శివుఁ డాజ్ఞాచక్రమునకు గొంపోవును. ఇదియే వింటికి నారిని గూర్చుట లేక "అవతతధన్వా" యగుట. సాధారణముగా ధనుస్సుల కల్లెత్రాడు రెండువైపుల తగిలింపఁబడియుండకపోవుటచే నవి దండాకారముగ, నిలువుగనే యుండును. ఏపురుషుఁడు ధనువునకు శివుని పేరు ఖండపరశువు కూడను.

"భూతేశః ఖండపరశుర్గిరీశో గిరిశోమృడః (అమరకోశము I)

మఱి యిదియేనామము భృగుపతికిఁగూడ కలదు. భృగుపతికి క్రౌంచదారణయను నామము కాళిదాసకల్పితమే.

"హంసద్వారం భృగుపతి యశోవర్త్మ
యత్ క్రౌంచరంధ్రమ్." (మేఘ దూ I-61)

క్రౌంచదారణ యనుపేరు కార్తికేయస్వామికిని (6) గలదు.

---

(6) షాణ్మాతురః శక్తిధరః కుమారః క్రౌంచదారణః (అమరకోశము)
"కైలాసే ధవదావాసే క్రౌంచః క్రౌంచోఽభిధీయతే"
(బృహద్ధారావళీ)

ఈ ప్రకారమున శివ, భృగుపతి, కుమారుల పరస్పరసంబంధముఁగూడ స్థాపితమగుచున్నది. శివుని తేజమే కుమారుఁడు గావున శివునకును కుమారస్వామికిని భేదమే లేదు. ఇంతియుగాక కుమారు నుత్పత్తికై ఏ స్త్రీయు నావశ్యకము కాలేదని ప్రసిద్ధిగదా. వస్తుతః కాళిదాసు కుమారస్వామిని అగ్నిముఖమందు సంభృతమైన (7) తేజమని వర్ణించి యున్నాఁడు. కాగా శివునియొద్దగల పినాకమే 'అజగవ' మను నామముతో పరశురామునియొద్దఁగూడఁ గలదఁట. ఇట్లు మూఁడింటికినిఁ గూడ సంబంధముగలదని తోఁచుచున్నది.

యోగసాధనమందు షట్చక్రభేదనమున ప్రాణ మేరంధ్రము ద్వారమున బయలుదేరి శివునివఱకుఁ జేరవలయునో అదియే క్రౌంచ రంధ్రదారణము. సుషుమ్నానాడి కపాలమందున్న యేరంధ్రమునుండి మస్తిష్కమున బ్రవేశించునో ఆద్వారమే యీ క్రౌంచరంధ్రము. సుషుమ్న యనెడు నాడి (Spinal chord) తెలుపు, విభూతిరంగుగల పదార్థముతో చేయఁబడినది. అది మూలాధారచక్రమందు బయలు దేరి పైనిగల నాలుగుచక్రములగుండ పోవుచు విశుద్ధచక్రమును (Cervical region) దాటి మస్తిష్కమున వ్యాపించును. 'సెర్వికల్ రీజియను' నందలి ప్రథమాస్థిపర్వమును ఆంగ్లమున 'అట్లాసు' (Atlas) అందురు. "అట్లాసు" తనస్కంధములపై ఆకసమును లేక ద్యులోక భారమును వహించియున్నట్లుఁగూడ ప్రతీతి. ఇటనుండియే సుషుమ్నా నాడి 'స్పైనలు బల్బు' (Spinal bulb) ద్వారమున మెదడులోనికి పోవును. అందుచే 'మెడల్లా అబ్లాంగేటా' (Medulla Oblongeta) యనఁబడెడి 'స్పైనల్ బల్బు' మన క్రౌంచపర్వతము. ఇందులోనే

(7) "తేజో హి సాక్షా ద్భగవతో హరస్యైవ
మూర్త్యంతరమిత్యర్థః" —మల్లినాథుఁడు.

అనఁగా ఆతేజము సాక్షాచ్ఛంకరుని మూర్త్యంతరమే యని యర్థము.

"మాగ్నమ్ ఫోరమెన్" (Magnum Foramen) అనెడి పెద్దరంధ్రము కలదు. అదియే క్రౌంచరంధ్రము. ఈ వివరమందే సుషుమ్నానాడి తిర్యగాయామమునఁ (అడ్డముగ మెలితిరిగి) వంగిప్రవేశించును. కుండలిని శక్తి మూలాధారమందు జాగరితమై శివనామధారియైన ఆజ్ఞాచక్రమును జేరునపుడీద్వారముననే పోవలసియున్నది. ఈ రంధ్రదారణము చేయుట భృగుపతికి యశముగూర్చునట్టి కార్యము. ఇట్లగుటచేతనే "భృగుపతి యశోవర్త్మ" యని కాళిదాసు పల్కినాఁడు. ప్రాలేయాద్రి హిమాద్రి అనఁగా పర్వములుగల్గిన పృష్ఠవంశోపాంతమందే ఈ క్రౌంచద్వారమున్నట్లు చెప్పఁబడినది. భృగుపతియని శివునకు మఱియొక పేరు. క్రౌంచదారణుఁడు, ఖండపరశువు, కుమారుఁడు, భృగుపతి, శివుఁడు— ఇవియన్నియు ఏకైకచైతన్యమునకే వివిధనామములు. విశేషమైన గుణములచేతనే యీ వివిధనామములు కల్పితములైనవి.

క్రౌంచతటమును దాఁటిన వెంటనే శుభ్రకైలాస మెదురగును. (మేఘ. సం. I-62) యోగశాస్త్రపరిభాషలో విశుద్ధచక్రానంతరమం దాజ్ఞాచక్రము కలదు. ఆ యాజ్ఞాచక్రమందే శివస్వరూపజ్యోతి విలసిల్లును. మూలాధారచక్రమందు యోగసాధనకై ఆరంభమయ్యెడి నృత్యము సిద్ధినందినపిమ్మట పరమశివుఁడు వజ్రాట్టహాసము చేయును. శివుని యీ యట్టహాసమే ఘనీభూతమై కైలాసరూపమును జెందినది.

"రాశీభూతః ప్రతిదినమివ త్ర్యంబకస్యాట్టహాసః

(మేఘ. దూ. I-62)

ఈ కైలాసమునకే రజతగిరియని పేరు. ఇచట నొకమణితటముఁ గలదు. దానిపై శివుఁడు గౌరితోఁ గలసి ఆరోహణము చేయఁగోరును. మేఘుఁడు స్తంభితాంతర్జలౌఘుఁడై (తన జలతత్త్వమును తనయందే నిలుపుకొనినవాఁడై) తన కాయమును మెట్టుగా మార్చుకొని యీ ఆరోహణమందు శివునకు సాయపడవలెను. యోగశాస్త్రగ్రంథములం

దీమణితటము (8) ను గూర్చి విశదమైన వర్ణనకలదు. పాదుకాపంచక మనెడి తంత్రయోగగ్రంథమందు మణిపీఠమహిమ బాగుగ చెప్పఁబడినది. మస్తిష్కమందున్న పరమచిన్మయ సహస్రదళకమలమందు అ-క-థ త్రికోణము కలదు. ఆ త్రికోణమందు మణిపీఠము కలదు. దానిపై రజతాద్రియందువలెనే అనంతగురువగు శివుఁ డనంతశోభతో విరాజిల్లుచుండును. అనఁగా ప్రకృతిపురుషసంయోగరూపమున గౌరీశంకరులు విరాజిల్లుదురు. మేఘదూతమందు శివుఁడు కామరూపపురుషుని (మేఘుని) స్తంభితునిగఁ జేసి మణితటారోహణము చేయును. ఈమణితటము తటిచ్ఛవిని (మెఱుపుకాంతిని) సిగ్గిలఁజేయునట్టిది. [పటుతటత్-కడారిమ-స్పర్ధ్యమాన మణిపాటలప్రభమ్]

కాళిదాసు, క్రౌంచరంధ్రము పిమ్మట కైలాసవర్ణనము మాత్రము జేసి యూరకుండక యచటి మణితటమునుఁగూడ నుల్లేఖించినాఁడు. అందువలన అతని యోగపరిభాషాసంకేతము స్పష్టముగ తెల్లమగుచున్నది.

"భంగీ భక్త్యా విరచితవపుః స్తంభితాంతర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ"

(మేఘ. దూ. I-64)

(ఓ మేఘుఁడా ! నీవు ముందునకు సాగిపోయి నీజలతత్త్వమును నీయందే స్తంభింపఁజేసికొని, శివునకు మణితటారోహణమునందు సాయపడుము-అని అర్థము)- ఈ వర్ణనముల సందర్భమున కవి కావ్యత్వముతోపా టత్యంతోన్నతములైన యోగశాస్త్రానుభవములనుఁగూడ

---

(8) బౌద్ధుల మహామంత్రమైన- 'ఓం మణిపద్మేహుం'— ఈ మణితటమునే సూచించుచున్నది. జ్ఞానపురి, శివధామమునైన కాశీకాపురియందు మణికర్ణికాఘట్టము గలదు. అందు స్నానము చేసినను, ప్రాణత్యాగము చేసినను మోక్షము సిద్ధించును. మణికర్ణిక యనఁగా సహస్రారదళకమలపు కర్ణిక యని యర్థము.

సగూఢముగ సమన్వయపరచెను. మల్లినాథుఁడు మేఘసందేశవ్యాఖ్య I-6 లో 'క్రీడాశైల' శబ్దమున కర్థము తెలుపుచు, శంభురహస్యము నుదాహరించుచు నిట్లు వ్రాసియున్నాఁడు-

"కైలాసః కనకాద్రిశ్చ మందరో గంధమాదనః క్రీడార్థం నిర్మితాః శంభోర్దేవైః క్రీడాద్రయోఽభవన్"- దేవతలు శంభునిక్రీడకై కైలాసము (రజతాద్రి) కనకాద్రి (మేరు, సుమేరు, హేమగిరి, మహారజతగిరి) మందరము, గంధమాదనము అనెడి పర్వతములను నిర్మించిరి. ఇందుచే నివియన్నియు క్రీడాశైలములైనవి-అని భావము. మేరుపర్వతము లేక మేరుదండమునకును దానికి సమీపమందేయున్న క్రీడాశైలమైన కైలాసమునకును గల పరస్పరసంబంధము స్పష్టముగ గోచరించును. కైలాస శబ్దమునకు వ్యుత్పత్తియే క్రీడాస్థానమని చెప్పవచ్చును.

'కేలీనాం సమూహః కైలమ్-తస్యసమూహః ఇత్యణ్-లేక ఆస్యతే అత్ర (అస్=కూర్చుండుట) ఇతి కైలాసః'-(భానోజీదీక్షితులు) అనఁగా శివుని క్రీడలకు, విలాసములకు స్థానమని భావము. ఇచట కుబేరుఁ డుండును. యక్ష, గంధర్వ, కిన్నర, సిద్ధ, చారణ మిథునములును విహరించుచుండును. ఇచటనే ధ్యానావస్థితుఁడై యోగిశంకరుఁడు తపం బాచరించుచుండును. పార్వతీశక్తిని వివాహమాడి ఆమెతో క్రీడించును. నిజమునకు మేరుదండమునే (వెన్నెముక) పర్వతముగ భావించి, దానికే వేరువేరు నామములు కల్పించిరి. మూలాధారచక్రమందున్న యీ మేరుదండభాగమునకు చిత్రకూటమనిపేరు. (9) ఏలన సుషుమ్నానాడి లేక కుండలినీశక్తికి "చిత్రా" యను పేరుకూడఁ గలదు.

---

(9) బూడిదరంగు, తెలుపురంగు రెంటి కలయికచే కుండలినికి 'లలిత' లేక 'చిత్ర' యనుపేరు వచ్చినది. గ్రేమేటర్ (Grey matter) వైట్ మేటర్ (White Matter) సంయోగమునచే చిత్రవర్ణము వచ్చును-అని ఆర్థర్ ఏవలన్ వ్రాసెను.-(సర్పెంట్ పవర్-Serpent Power- పాదుకాపంచక భాగము 165 వ పుట.)

ఈ చిత్రిణీ మూలాధారచక్రము నాధారముజేసికొని నిలచియున్నది. 'చిత్రి' యొక్క కూటమే చిత్రకూటము. ఇదియే రామగిరి. ఏలన శివునివలె శివధనుస్సును రాముఁడే అధిజ్యము (నారిఁగూర్చుట) చేసెను. ఇటనుండియే కామపురుషుఁడు బయలువెడలి కైలాసపర్వతాంకమందున్న అలకాపురికిఁ బోవును. మేరుదండమున నొకచివర శివుఁడు మఱియొకచివర రాముఁడును కలరు. ఈ రెంటికొనలమధ్యనే "అజగవ" ధనువు అవతతమై వ్యాపించియున్నది. కుండలినీవివరమును సహస్రారపద్మము కప్పియున్నది. కుండలినీవివరము, (బిలము) అనఁగా స్పైనల్ కార్డ్‌నందున్న స్పైనల్ కెనాల్, (Spinal Canal) మూలాధారమందున్న శివతేజమునుచుట్టి, ప్రసుప్తమైయున్న కుండలిని పైకారోహించుచుఁబోయి శివునితో కలియునట్టి మార్గమని తాత్పర్యము. చిత్రిణిలోనే యీ మార్గముకలదు. ఈ వివరముగల మార్గము చిత్రిణీయని యెంచవలెను. కమల మెట్లు తనకాడ పైకొనను శోభిల్లునో అట్లే చిత్రిణికిని సహస్రదళ, ద్వాదశదళపద్మములకును సంబంధము కలదు. చిత్రిణీ లేక కుండలిని యనునది పరమచైతన్యజ్యోతి. సమస్త సృష్టికి కారణభూతమైన స్పందనాత్మకశక్తి యిదియే. దీని యిచ్ఛా, జ్ఞాన, మాయామయమమైన త్రిగుణాత్మకమూర్తియే జీవులందు (పశువులందు) సత్త్వ, రజస్తమోరూపమునఁ జూపట్టును. దీని సంకోచ, ప్రకర్ష స్ఫురణచేతనే క్రీడాశరీరము కల్గుచున్నది. ఋగ్వేదమున నీయదితిశక్తికే అష్టపుత్త్రిలున్నట్లు చెప్పఁబడియున్నది. శైవసిద్ధాంతమందుఁ గూడ శివుని యెనిమిదిమూర్తులను ప్రసిద్ధములే (10) యోగసాధనమున

---

(10) శ్రీచిచ్ఛక్తిరేవ పారమేశ్వరీ జ్ఞానక్రియామాయా - శక్తిత్రితయతయా. శ్రీ సదాశివాదిపదే స్ఫురిత్వా సంకోచ ప్రకర్షాత్ సత్త్వరజస్తమోరూపం క్రీడాశరీరం శ్రయతి (స్పందనిర్ణయము-పుట-37)

సుప్రబుద్ధులైన యోగులు తమ చిచ్ఛక్తి స్ఫురణచేతనే సమస్తజగత్తును అధిష్ఠితముగ గ్రహింతురు: (ప్రత్యభిజ్ఞాశాస్త్రము)

సప్తర్షులు (పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి) కుండలినీరూపిణియైన ఉమకును, శివునకును మధ్య కూర్చువారై వివాహసంబంధము నిశ్చయింతురు. పార్వతితో శివునకు వివాహము జరుగుచుండఁగా నీసప్తర్షులు నా వివాహయజ్ఞమున కధ్వర్యులగుదురు. ఈ యజ్ఞమందు వారి యనుమతి, శుభాశీర్వాదమున్నపుడే యది సఫలము కాఁగలదు. కుమారసంభవమున (VII-47 లో) శివుఁడు "వివాహయజ్ఞే వితతే ఽత్ర యూయమధ్వర్యవః పూర్వవృతామయేతి" యని పలికెను. అనఁగా వివాహయజ్ఞము వితతమైన (ఆరంభమైన) తోడనే ముందుగనే నేను మిమ్ములను నా అధ్వర్యువులుగఁ జేసికొంటిని-అని భావము.

(సశేషము.)



# ఆంధ్రపుష్పబాణవిలాసము

శ్రీ విశ్వనాథ నరసింహము, ఎం. ఏ. బి. ఇడి.

మదవతులైన గోపికల మందగతిన్ బిగికౌఁగిలింపఁగా
నెద సిరిగందముల్ సడలి యింపగు సౌరభము వ్యహింపగన్
నిదుర గనంగరామి తన నేత్రము లెఱ్ఱదనంబు నందగన్
సదమల వేణుగాయకుఁడు జారులమేటి శుభంబు మీకిడున్.

వరరసికత్వమొప్ప వ్రజభామలనెకులతోడి క్రీడలన్
కరమరుదైన నందసుతు క్రమచరిత్రము గొంచు నే మనో
హరమగు కావ్యకల్పనము వారసరాజమునందుఁ జేయఁగా
దొరకొనియుంటి శారద మృదూక్తులఁ జిత్తమెలర్పఁగా వులన్.

కాంతుఁ గనంగ పక్ష్మలు వికాసముజెందె వతండు నిర్జనో
పాంతగృహంబుఁ జేర తెనువంతట పుల్కలునిండె నామెయున్
శ్రాంతివడంకె నాథుఁడు వెసన్ బిగిచన్నులనొత్తఁబోవ న
క్కాంతకు నీవిజాఱె తనకంఠము నాతఁడు కౌఁగిలింపగన్.

దరహాసవంబుతో వికచతామరసానన మాటిమాటికిన్
కరమున వాలుగన్నులను గప్పుచు నుబ్బెడి గబ్బిగుబ్బలన్
దొరఁగుపయంటఁ జూడక యెదోపని బూనినయట్లు దవ్వులన్
వరసఖ! చూచుచున్నయది వంచనసేయు జనాళి గంటివే.

విరిపొడి మాధవీలతల వెంబడి నీపొదరింట దట్టమై
కురిసిన పోయుగంబు వదిగో కనుపిందగు నీపికాంగనల్
గురుతుగ కూయుచుండె రతికూజితమున్ దెలియంగరాదు సుం
దరముగఁ జూడు మీయబలకొప్పుముశయ్యను పూలపాన్పునన్.

శ్రమసెద వేల నీకు నధరంబును బింబముగా గ్రసించె వి
భ్రమమున కొప్పుజాఱె నట శ్రాంతి కరంగె లలాటరేఖ గా
త్రము క్షతమయ్యె కంటకవిలాసముచే నటవీశుకంబుకై
విమలమతీ ననాంద నెఱిపీడిన పూవులఁగోసె జూడుమా.

ఒక కరపల్లవంబున తలోదరి జాఱిన కొప్పువట్టి యిం
కొకట కుచంబులన్ సడలియున్న పయంట సమర్చి మేనిపై
ప్రకటపుఁజందనంబు రుచిరంబుగ మోవిని రాగ మొప్పఁగా
సకి ప్రియమందిరంబు విడి పోగె రతీశు జయాంకలక్ష్మియై.

జగతికి సంతసంబు నిడు చంద్రుఁడు నాకు విరోధియయ్యె బా
ధగ వినిపించె కోకిల రుతంబులు తోటల మందవాయువుల్
మిగిలిన ప్రాణవాయువులమీఁద పగంగొని యాహరించెడిన్
మగఁ డతిదూరమేఁగు ననుమాట వినంబడినంత నెచ్చెలీ.

నవనవమైన కోమలవనాంతర పల్లవశయ్య తాపమున్
మివులక కల్పితంబు కరనీరజసంగతి మ్లానమయ్యె మా
ధవుఁడను వహ్నిచేఁ దవిలి దాపరమైనది కోమలాంగికిన్
శివ శివ యేమటంచు మఱి చెప్పగ నా విరహాతిరేకమున్.

శీతకరుండు నంబుజముఁ జేరి శయించెడి మాక్షికౌఘముల్
జాతములయ్యె కైరవపుజంట సువర్ణపుతీవ శ్వేతమా
ప్రాఁతవహించె తామరలమొగ్గల రాపిడి పూలదండలో
యీ తుమురయ్యె నాపయున మింక నొనర్పఁగ శంకపెట్టెడిన్.

దూతీ నీనయనోత్పలద్వయమునందోఁచె న్నితాంతశ్రమం
బే తత్స్వేదకణాళి ఫాలతలమందే పొందె ముక్తాశ్రియ
స్ఫీతంబౌచు నిరంతనిశ్వసన మిస్సీ తీవ్రమా చంద్రికల్
యా తాపాతిశయంబునం బడలె దేహంబింత నాతప్పునన్.

చెలియరో యీమృగాక్షి. వ్యథఁ జెంది దురంతవసంతకాల వి
హ్వలవిరహాతిరేకమున ప్రాణవిసర్జన మిచ్ఛగించి ని
ష్ఫలసమమైన క్రొంజివురుప్రోగగు తల్పము నెక్కుచుండె కో
మలలలితాంగి యేగతిని మాన్పగనౌను తదీయకృత్యమున్.

కలరవ మాలపించు కలకంఠరుతంబులు నిష్ఠురంబులై
మలయమరుత్కిశోరముల మాంద్యము శీతకరుండు తీవ్రమై

పాలించియు నామమాత్రమదె పానొనరింప నిరీక్షణంబులన్
తలఁకు త్రుణాము లాయబల తెప్పరతేగ గని మేను నిల్పెడిన్.
కనులజలంబు నింపకుము కాటుక రేక కరంగుచుండె సూ
తన సుమహారముల్ సునిశితంబగు నూర్పుల మాడుచుండె శ
య్యను పొరలాడఁబోకు మెయివంటిన పూఁత తొలంగుచుండె నో
య్యన దయితోపయాన సమయంబు గతింపగ లేదు మానినీ.
నెచ్చెలిబిందుతోఁ గలసి నెయ్యపువేడుకలన్ భ్రమింపఁ దా
వచ్చిన దూతితో హృదయభావము దెల్పఁగ లోచపద్వయిన్
హెచ్చుగఁ గజ్జలంబునిడి యిందునిభాస్య కుచంబు లుబ్బగా
చెచ్చెర రత్నమాలికను చేతులఁ గైట తెమల్చి కప్పెడిన్.
ఇందునికాంతి మూరుకొను నింతిమొగం బధరంబు చుంబనం
బందెను బింబకాంతి రుచిరాంబుజకోరకముల్ కుచంబులన్
విందుగఁ దాకనెంచె నరవిందములా కరయుగ్మఖేలనం
బొందె ప్రవాళకాంచి విరిబోడిపదమ్ముల నాశ్రయించెడిన్.
పరహిత మాచరింప నినువంటిది లోకమునందు లేదహో
నెఱిపలుకుల్ మనుక్తములు నీవొనరించితి నిక్కువంబు సుం
దర సుకుమారదేహము మదర్థము గాసినిఁబొందె నెచ్చెలీ
వరసుకృతంబు లెట్లు ఫలవంతిములౌ శ్రమబొందకుండినన్.
మునుపటివోలె పూలసరముల్ కబరీభరమందు నుంచ దే
మన మృగనాభిచిత్రకము వచ్చపురీతిగఁ బెట్టఁబోదు కా
మిని పలుమారు నాయెదుట మిక్కిలిగాఁ జరియింపరాదు నే
నొనరిచినట్టివిప్రియము నోసఖి నీవయినన్ వచింపుమీ.
చాటగు కౌఁగిలింత సరసంబగు ముద్దులు చన్నులొత్తుటల్
మాటలమాత్ర మయ్యె వినుమా పలుగాకుల భీతిచేత నీ
నాట లభింపరాదు వచనస్థితిస్నైనను బాధలేదు నా
నాటికి దర్శనంబయిన సందగరాదని చింతనొందెదన్.

నగు మొగ మెంచి చంద్రుఁడు వినమ్రముఁడునై తనమచ్చఁ జూచెనే
మగువ ఘవాసకీరముల మాటికి స్వీయమృదూక్తి దూరె నో
తొగలపరీమళంబునను దోఁచు సమీరుని గెల్చె నూర్పు నా
యుగుడ వియోగభారమున ముమ్మరమౌ పరితాప మొందెడిన్.
చెలి! కలకంఠగానమునఁ జెన్నువహింపదు వీణెపాట కో
మలదరహాసరోచి కడు మ్లానమొనర్చును చంద్రికాలతన్
కలువలు వాడువారినవి కాంతికనుంగవఁ జూచినంత చం
చల మనుమేనికాంతి గవఁ జాలవివర్ణతనందె చూచితే.
కాంతుఁడ నాపయింగలుగు గాటపురాగమటంచుఁ బల్కు నీ
మంతనముల్ నిజంబు కడు మక్కువ వచ్చితి వేఁగుఁబోకటన్
శ్రాంతిని నేత్రముల్ నిదుర చాలమి తెల్పెడి వక్షమందు నీ
స్వాంతపురాగ మొప్పె నునుఫాలము లత్తుకపూఁత జూపెడిన్.
ఈ మధుమాసమందు హృదయేశ్వర నీపరదేశయానమున్
నామదిలో విచారము గనంబడఁ జేయదు సాంద్రచంద్రికా
స్తోమము కైరవప్రకరశోభిత సౌరభవాతపోతముల్
తాము విజృంభణంబుఁ గన తాపము శాంతివహింపకుండునే.
కల్లలు నెచ్చెలుల్ పలుకఁగాఁ బొలయల్క వహించితీవు నీ
చల్లనిపల్కులన్ సుధలు జాలు శ్రుతంబులు, నేత్రజాడ్యము
త్ఫుల్లముఖాంబుజంబుఁ గనఁ బోవు ప్రసాదకటాక్షశీతలం
బల్లనఁ జూపు మానిని రయంబు విభావరి సాముజారెడిన్.
నలుఁడగు కాంతు జూడదు తనంతటఁ బోయిన నెచ్చనూర్పు బే
లతనపుబాల నెచ్చెలులు లగ్గొనరింపఁగఁ దోడి తెచ్చినన్
మతి ననుమానహానముల మార్గముంచు వకుండ పోవఁగా
జతనముసల్ప జీవితము సంశయమౌ నిఁక నేమి చెప్పఁగన్.
ఆ నవమోహనాంగి వచనాళి పికంబుల గెల్చు మోమునం
గానఁగరాదు చంద్రరుచి క్రమకటాక్షవిలోచనంబులం
గాన మృగీవిలోలత సగంబగు నింతి శరీరకాంతులన్
గానఁగరాదు నందముగ కాంచనవల్లిక యేమిచెప్పుదున్.

---

# గ్రంథస్వీకారము - సమీక్ష

బందారు తమ్మయ్య.

(1) ఖండకృతి:- క్రౌను పుటలు 42 వెల 0-12-0
(2) వ్యాసవాణి:- క్రౌను పుటలు 30 వెల 0-6-0
(3) కవిత:- క్రౌను పుటలు 80 వెల 0-8-0
(సంకలనగ్రంథము)
(4) నవగీతాలు:- క్రౌను పుటలు 18 వెల 0-3-0

కర్త:- ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు. సీనియరు తెలుఁగుపండితులు, హైస్కూలు, చిలకలూరుపేట, గుంటూరుజిల్లా. అధ్యక్షులు భారతీసన్మానసంఘము.

(5) శ్రీ కొత్త భావయ్యచౌదరిగారి సన్మానసంచిక పుటలు 14
(6) శ్రీ షేక్ షరీఫుకవి సన్మానసంచిక పుటలు 28
(7) శ్రీ చిత్రపు హనుమంతరావుగారి సన్మానసంచిక పుటలు 20
(8) శ్రీ భారతీసమితి జయసంవత్సర ఆషాఢమాససంచిక పుటలు 20
(9) ,, మన్మథ శ్రావణమాససంచిక పుటలు 24

సంపాదకులు:- భారతీసన్మానసంఘాధ్యక్షులు శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు. కార్యదర్శి కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు.

శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు సహజముగ జాతీయభావోద్దీపనము గల యువకులు. ప్రపంచశాంతికి నభ్యుదయమునకు సర్వోదయసిద్ధాంతసిద్ధి యత్యంతావశ్యకమని విశ్వసించి తదర్థమయి తమ సాహితీజ్ఞానమును సాధనముగాఁ గొని తద్వికాసమును బహుముఖములుగ నందుకయి వినియోగించి వ్యాప్తమొనర్చుచున్న దేశసేవకులలో విశిష్టస్థానము నలంకరించువారలలో నొకరు. గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమములోఁ బాల్గొని యప్పటి ప్రభుత్వమువారి కారాగృహాతిథ్యమును గొంతకాలము గ్రహించి యనంతరముగూడ నిజాశయసిద్ధికై సారస్వతమునే యూలంబించి యాంధ్రభాషోపాధ్యాయ వృత్తినే జీవికగాఁ గొని బ్రహ్మచర్యాశ్రమమునందే యిప్పటికి జీవితము గడపు

లున్నవారు. గాంధిగారియెడ విశేషభక్తి గలిగి తజ్జీవితచరిత్రమును ఆత్మకథ యనుపేర పద్యకావ్యముగను, మఱియు రాష్ట్రగానము, పఱిగపంట, ఆత్మార్పణము, ఉదయగానము, ధర్మజ్యోతి మున్నగు నుత్తమకృతుల నెన్నిటినో రచించి వాసికెక్కిన యభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు వీరికి మేనమామ. ఆశయములలోను, కవితారీతులందును మేనమామపోలికలు వీరియందుఁ జాల వఱకు వాత్తియున్నవి. ఏపట్టునఁ జూచినను వీరి పద్యములేమి, గద్యములేమి విశాలభావవిలసితములయి చదువరుల కానందముగూర్చుచుండును.

"కలవు సహస్రభాషలు జగమ్మున నందొకఁడేని దేనియల్
చిలికెడి తెల్గుతోడ సరిసేయఁగఁ జాలదు; విశ్వమెల్ల నీ
పలుకున కడ్డుసెప్పదు సెబాసని విజ్ఞులు మెచ్చ నుందరో
జ్జ్వల కవితల్ సృజించి మన జాతికి నభ్యుదయమ్ముఁ గూర్పుఁడీ."
"తెలుఁగువాన్కికై త దేశదేశాలకు, నొజ్జబంతి యగుచు విజ్ఞుఁగాక
ప్రాజ్ఞుఁడై కళాతపస్వియై విశ్వ సాహిత్యరాజ్య మాంధ్రుఁడేలుఁగాక"

అను పద్యములు వీరి మాతృభాషా దేశాభిమానముల కాదర్శకములు.

(1) ఖండకృతిలో ప్రార్థన, పుస్తకము, కవి, చిత్రకారుఁడు, జనకుఁడు, స్వాగతము, పుష్పవాంఛ, భారతసృష్టి, పాదపము, చిలుక, శ్రీకృష్ణాష్టమి, భూతదయ, తెలుఁగుబిడ్డ, ఆసియా, సమత, పాఠశాల, గురువు, ఆంధ్రమాత, రాష్ట్రప్రబోధము, కర్తవ్యము, కన్నీరు, వయోజనవిద్య, గ్రంథాలయోద్యమము, కవిసమ్మేళనము, మహాత్ముఁడు, బోసుపీరుఁడు, అది, ఇది, ఆకాంక్ష, సేవ, భారతనారి, మాతృభూమి, అను శీర్షికలక్రింద వీరప్పుడప్పుడాయాసందర్భములందుఁ జెప్పిన పద్యములు సేకరింపఁబడి ముద్రింపఁబడినవి. పద్యములన్నియు భావౌన్నత్య, భాషాలాలిత్యములతో సుబోధకములుగ నింపెసలారుచున్నవి. అందఱు చదివి యానందింపదగినవి. గ్రంథాంతమున నేఁటి పండితవర్యులు పత్రికాధిపతులు కొందఱి యభిప్రాయములు, ప్రశంసలు ప్రకటితములయియున్నవి.

"పుష్పవాంఛ" యందలి

"దేశగౌరవసంపత్తి దీక్షతోడఁ, గాచుచుండెడివారల కరములందు
జాతిసాహిత్యసర్వస్వసదనమందు, మాన కెప్పుడు నివసింప నేనుదలఁతు."
"కోరను యశమును సుఖమును, గోరను రాజ్యంబు నెపుడు, గోరను ముక్తిన్
గోరుదు నార్తులసేవను, గోరుదు నా హృదయమందు క్షోణీహితమున్."

అను పద్యములలోని భావౌచిత్యము ప్రశంసింపఁ దగినది.

(2) వ్యాసవాణి:—ఇందు సాహిత్యము, కళారాధన, సంస్కృతి, లలితకళలు, గేయకవిత, కవి, కర్మయోగి, పఠనమందిర గ్రంథాలయ లాభములు, చిత్రశిల్పములు అను విషయములపయి సత్యసమ్మతము లయిన యుదారభావములతో వీరు రచించిన చిన్నచిన్న వ్యాసములు సేకరింపఁబడి ముద్రింపఁబడినవి. అమోఘాశయములతో భావములతో నాతిదీర్ఘములుగ రచింపఁబడిన యిందలి వ్యాసము లెల్లను నవశ్యముగఁ బఠింపఁదగినవి.

(3) కవిత:— నన్నయ మొదలుకొని నేఁటిదనుక వెలసిన ప్రాచీనాధునిక కవివతంసులలోఁ బలువురు కవి, కవిత, ఆంధ్రభాష, చిత్రకారుఁడు, పేదలు, తెనుఁగుతల్లి, ఆంధ్రవిద్యార్థి, భారతమాత, భారతనారి, మైత్రి, గురువు, పుస్తకము, శారద మున్నగు విషయములఁ గూర్చి వ్రాసిన రసవత్పద్యముల నేర్చి కూర్చిన సంకలనగ్రంథ మిది. జోహారు, ముందడుగు, ఆంధ్రమాతృ స్తవము, ఆంధ్రపతాకము, తిమ్మఁడా, ఆంధ్రులం, దేవాలయం-గ్రంథాలయం, దేశభక్తి, సమతాధర్మము, లెండోయి, సైనికశిక్షణ, కవినోయ్, మంగళం అను శీర్షికల క్రింద నేఁటి కవికుమారులు రచించిన గీతములు, బంకించంద్ర, రవీంద్రనాథుల జాతీయగీతములుగూడఁ జివరఁ గూర్పబడియున్నవి. అక్కృతిలోఁ జిన్నదయ్యు విషయవిశిష్టతచే మిన్నయైయున్న యీపొత్త మాంధ్రసోదరుల కెల్ల నాదరణీయమని యభినందించుచున్నాము.

(4) నవగీతాలు:— గ్రంథాలయమ్, వయోజనవిద్య, సైనిక శిక్షణ, స్వాతంత్ర్యదినోత్సవము, లంచగొండితనమ

గాంధీనిర్యాణము అను విషయములఁగూర్చి శ్రీ నరసయ్యగా రాయా సమయములందు భావావేశముతో రచించిన గీతము లిందుగలవు.

విశాలహృదయులగు శ్రీ వేంకటనరసయ్యగా రుద్యమించిన ఘన కార్యములలో భారతీసమితి భారతీసన్మానసంఘముల సంస్థాపనము, తత్కార్యక్రమములు గణనీయములు, ప్రశంసనీయములు నయియున్నవి. వీరు, వీరి యనుయాయులు విద్వాన్ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు గారు (గుడివాడ తాలూకా పామర్రు హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు) మున్నగువారీసంస్థల నిర్వహించుచుఁ బ్రజలనుండి విరాళముల సేకరించి భాషాపండితులను, కళోపాసకులను దేశసేవకులను బిరుదప్రదానములతో నేగాక యుచితరూపకసత్కారములతోఁగూడ సన్మానించి యాదరించుట యెంతయు ముదావహము. ఇంతవఱకు వీరిచే సన్మానితులయినవారలలో కీ. శే. మంగిపూడి వేంకటశర్మగారు, షేకు ఫరీదు కవిగారు, బందరు వాస్తవ్యులు నాటకపితామహ శ్రీ చిత్రపు హనుమంతరావుగారు, విమర్శకాగ్రేసర శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు, శ్రీ రాం వీరబ్రహ్మకవిగారు, శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రిగారు, శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారు, శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజుగారు, శ్రీ గొట్టిపాటి వేంకటసుబ్బయ్యగారు, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు మున్నగువారున్నారు; పైని చేర్కొనిన పొత్తములలో 75-9 సంఖ్యగలవి యిట్టి సన్మాన సందర్భములలో వెలువడినవి. వానిలో నాయా పండితులకు సంబంధించిన సన్మానపత్రములు సందేశములు ప్రశంసలేగాక యుపయుక్తములగు నితరవిషయములుఁగూడ నందందుఁ గలవు.

ఈసంస్థలు గావించుచున్న యేతాదృశసేవ యత్యంత ప్రశంసనీయమని చెప్పనక్కఱలేదు. జయప్రదముగ నిజాశయముల నిర్వహింపఁగల్గుటకయి యాంధ్రులెల్ల రౌదార్యముతో వానికిఁ దోడ్పడెదరుగాక యని యాశించుచున్నారము.

---

# విజ్ఞప్తి.

కాగితము కఱవును, బహుళవ్యాప్తమైన "ఫ్లూ" జ్వరమువలన ముద్రణాలయమున పనిజరుగమియును మా చందాదారులకు సకాలమున పత్రికలందింపకుండుటకు ప్రధాన హేతువులు. ఇటబట్టి సకాలమున పత్రికలు చేరగలవని పరిషద్విజ్ఞప్తి-

కార్యదర్శి.